# ఉపనిషత్తుల బోధలు
# కథలు



చర్ల గణపతిశాస్త్రి

# ఒక విన్నపము

బ్రహ్మశ్రీ చర్ల గణపతిశాస్త్రిగారిని గురించి తెలియని వారు విశాఖపట్టణమున లేరనవచ్చును. ఎందుకనగ వారు సంగీత సాహిత్యాది సభలు ఎప్పుడు ఎక్కడ జరిగినా ఆహ్వానించినా, ఆహ్వానించకపోయినా వెళ్ళేవారు. అందరిని సాదరంగా పలుకరించి మాట్లాడేవారు. శ్రీ చర్ల గణపతిశాస్త్రిగారు అనేక సంస్కృత గ్రంథములను తెనుగువారికి తేటపరచుటకొఱకు అనువదించేరు. వేద విజ్ఞానమను గ్రంథమును రచించి వేద స్వరూపమును తెలియజెప్పారు. ఋగ్వేద సంహితను రచించి వేద మంత్రార్థములను వివరించారు. అట్లే దశోపనిషత్తులను మూల మంత్ర సహిత తాత్పర్యార్థములతో విశదపరచారు.

సామాన్య ప్రజానీకానికి అందుబాటులో రచన యేదీ చేయలేదని శాస్త్రిగారు అనుకునేవారు. ఉపనిషత్తులు అందరికీ అర్థమయ్యేవి కావు. అందుకు తగిన ఆత్మజ్ఞాన సామర్థ్యం ఉంటే గాని ఉపనిషత్తులు బోధపడవు. ఈ విషయాన్ని గ్రహించి శాస్త్రిగారు ఉపనిషత్తులలోని కథలను తీసుకొని, వాని మూలమున సామాన్య ప్రజానీకానికి ఆత్మ జ్ఞానమును ప్రబోధించేరు.

దశోపనిషత్తుల సారాన్ని ఒక చిన్ని పుస్తకములో అదీ కథల రూపేణా రచించడమన్నది మహత్తరమైన విషయం. ఇది గణపతిశాస్త్రిగారి నిశితదృష్టికి కర్తవ్య నిష్ఠకు నిదర్శనము. అణువు చిన్నదయినా దానిశక్తి అపారమైనట్లు ఈ పుస్తకము రూపంలో చిన్నదయినా జ్ఞానబోధనకు ఉత్తమ గ్రంథము.

శ్రీ శాస్త్రిగారు రచించిన ఉపనిషత్సుధ మొదటి భాగము ఈశ, కేన, కఠ, ప్రశ్నోపనిషత్తుల మంత్రములకు అర్థ తాత్పర్యములను జోడించి ముద్రించిన పుస్తకము అతి త్వరలో ప్రజలకు దర్శనమీయనున్నది.

శ్రీ చర్ల గణపతిశాస్త్రిగారి పుస్తక ముద్రణాది వ్యవహారములు వారి కుటుంబ సభ్యులు కొనసాగించుచుండుట సంతోషకరమైన విషయము. త్వరలో బ్రహ్మ మీమాంసా దర్శనము కూడ మరల అచ్చయి ప్రజల ముందునకు రాబోవుచున్నది. అంతేగాక మిగిలిన ఉపనిషత్తులు గూడ ముద్రింపించి అందించుటకు శ్రీ శాస్త్రిగారి కుటుంబ సభ్యులు సంసిద్ధులై యున్నారు.

ఇట్లు

భక్తజన సేవకుడు

కోపల్లె రామమూర్తి

నిత్య మనంత మనాద్యము
శ్రుత్యంతజ్ఞేయ మఖిలలోకాశ్రయమున్
సత్యస్వరూప మవ్యయ
మత్యంతానందతత్త్వ మనయముఁ గొలుతున్.

తొలి నారాయణుఁడాత్మ రూపమున
నెందున్ క్షీరమట్లొప్పి లీ
లలకై పాలమీఁగడ యటుల్
వ్యక్తాకృతిన్ బొంది ని
ర్మల మాకాశము, నందు గాలి, జ్వలనం
బాపై, నటన్ నీరు నం
డిల, యన్నంబయి జీవియై వెలుఁగు
నా యీశున్ సదా మ్రొక్కెదన్.

శ్రీ నారాయణబుధు వి
జ్ఞానధురీణుని ననేక శాస్త్రజ్ఞుఁగవీ
శానుని జనకు గురుఁ దలఁచి
జాను తెనుఁగునందు మవనిషత్తులఁ గూర్తున్.

# విషయసూచిక

పుట



[] • []

# ఉపనిషత్తుల - బోధలు - కథలు

## 1. ఈశావాస్యోపనిషత్తు

ఈ యుపనిషత్తు శుక్ల యజుర్వేదములోనిది. ఈ యుపనిషత్తు ఈశ అనుదానితో ఈశావాస్య అనుదానితోను ప్రారంభింపఁ బడినది గాన ఈశోపనిషత్తు ఈశావాస్యోపనిషత్తు అని పిలువబడును. ఇందు ఆత్మ స్వరూపము వర్ణించఁబడినది. వ్యాపకమైన పరబ్రహ్మము పూర్ణమైనది. ఈ జగత్తు కూడఁ బూర్ణమైనదె. ఆ పూర్ణ బ్రహ్మమునుండి ఈ పూర్ణజగత్తు బయలు దేఱును. అది యీ జగత్తునకుఁ బూర్ణత్వము గూర్చి తాను పూర్ణముగానె యుండును.

భగవంతుఁడు జగత్తులో మాఱుచు కనిపించు ప్రతి పదార్థమునందు ఉన్నాడు. నీవు ఆ పదార్థమును త్యాగము చేయుట ద్వారా నిన్ను రక్షించుకొనుము. నీవెవరిదానిని ఆశింపకుము.

ఇక్కడ నీవు సత్కర్మలు చేయుచునే నూఱేండ్లు జీవింపఁ గోరుము. అట్లు చేసినచో నిన్ను కర్మలు బంధింపలేవు.

దేహముకంటె వేఱె ఆత్మలేదని తిరస్కరించువారు చచ్చి పోయి అంధకార తమస్సుతోఁ గూడిన యసుర్యములు అసుర-ప్రాణములు ఇంద్రియములు వానియందు రమించువారు అసురులు. వారికి సంబంధించిన లోకములు. అసురులు ఆ లోకములందుఁ బడుదురు. ఎవఁడు అన్ని భూతములందు తన్నును తనయందు అన్ని భూతములను జూచునో వాడు ఏ భూతమును ఏవగించుకొనఁడు.

పంచదారతోఁ దయారుచేసిన వస్తువులు పైకి ఛిలుకలుగా గుఱ్ఱములుగా ఏనుగులు మొదలగునవిగా నున్నను వానిలో నున్నదంతయు పంచదారయే యగునట్లు ఆత్మతోఁ గూడిన పురుగులు పక్షులు పశువులు మనుష్యులు మొదలగు జీవులన్నియు ఆత్మరూపములే అన్ని భూతములు ఆత్మయే యైనపుడింక వానిలో ఏకత్వమును ఆత్మత్వమును చూచువానికి మోహము శోకము ఎక్కడివి? ఆత్మ ఆకాశమువలె అంతట నిండియున్నది. అది శుద్ధము. శరీరము నకేగాని దానికి రోగాదులు లేవు. అది క్రాంతదర్శియైన కవి. మనస్సునకు ప్రభువు తనకు తానె పుట్టినది. అది ఎపుడును ఉన్నదే. అది తన లీలలకై అనేక శరీరములను ధరించుచున్నది. అది స్వల్పరూపములో ఉండుటచే తాత్కాలికముగా శరీర దోషములచే దోషయుక్తముగా గనిపించుచున్నను అది ఆ దోషములను బొగ్గొట్టుకొని నిప్పువలె పరిశుద్ధమై యుండును.

అగ్ని పరిశుద్ధమైనను మురికి వస్తువులను కాల్చునపుడు దుర్వాసన కలిగి అగరువత్తులను కాల్చునపుడు సువాసన కలిగి యుండును. చివరకు అది శుద్ధమగును. అట్లే ఆత్మయును.

ఎవరు అవిద్యను — దేవతా జ్ఞానము లేక కర్మలను మాత్రమే ఉపాసింతురో వారంధకారములో పడుదురు. ఎవరు కేవలము విద్యను—కర్మలను గాక దేవతోపాసనను మాత్రమే ఉపాసింతురో వారింకను ఎక్కువ యంధకారములో పడుదురు. విద్యవలన ఒక విధమైన ఫలమును కర్మలవలన ఇంకొక విధమైన ఫలమును గలుగునని పెద్దలు చెప్పిరి. ఆత్మ శరీరమును ధరించి యున్నది. గాన జ్ఞానమును పొందక కర్మలను చేయక

పోయినచో హాని కలుగును. కనుక తెలిసికొని రెండును చేయు వారు అవిద్యచే మృత్యువును దాటి విద్యచే అమృతత్వమును పొందుదురు. కేవలము నామ రూపాదులు గల బ్రహ్మమును ఉపాసించినచో అంధకారములోఁ బడుదురు. కేవలము నామ రూపాదులు లేని బ్రహ్మమును ఉపాసించినచో ఇంకను అంధ కారములోఁ బడుదురు. శరీరములకు నామరూపాదులుండును. ఆత్మకు నామరూపాదులు లేవు. కాన రెండును ఉపాసింప వలెను. బంగారమువలె మెఱయునట్టి ఆశ అనెడి పాత్రచేత సత్యమైన ఆత్మ యొక్క రూపము గప్పఁబడి యున్నది. పోషకుఁడైన ఓ సూర్య! (దేవా!) సత్యమె ధర్మముగాఁ గల దృష్టిని మేము పొందుటకు ఆ బంగారువంటి ఆశ అనెడి పాత్రను తీసివేయుము. ఓ దేవా! బంగారువంటి యాశా కిర ణములను ఒకసారి ఉపసంహరింపుము. అట్లయినచో నీ కళ్యాణకరమైన యాత్మ రూపమును జూడఁగలను. నీలోని ఆత్మపురుషుఁడనే నేను ఈ శరీరము ప్రాణవాయువుతో నిండి యున్నది. శరీరము పోయినపుడు ప్రాణవాయువు అనంత వాయువులోఁ గలిసిపోవును. కాని యాత్మ మాత్రము చని పోదు. నీవు కేవలము సంకల్ప రూపమైనవాఁడవు. కనుక నీవు చేసిన వానిని జ్ఞాపకము తెచ్చుకొని శరీరము వలన వచ్చిన దోషములకు లొంగకుము. ఆ దోషములను తొలగించుకొనుము. అసత్యము, అన్యాయము అధర్మము చేయకు. ఓ యగ్నీ,— మమ్మ అగ్రమందు నడపువాఁడా! మమ్ము మంచి మార్గము ద్వారా శాశ్వతానందము కొఱకు నడపుము. నీవు జ్ఞానములను తెలిసినవాఁడవు. మేము ఈ శరీరమును బట్టి దీనిద్వారా చేసిన పాపములను నశింపఁ జేయుము. మమ్మింక పాపములను జేయనీయకుము. అటు పాపము చేయనీయని బుద్ధిని దయ చేయుము. నీకివే అనేక నమస్కారములు.

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

# 2 కేనోపనిషత్తు

ఇది సామవేదలోనిది. ఈ యుపనిషత్తుకు మొదటి పదము 'కేన' (దేనిచేత ఇదంతయు బయలుదేఱినది) అను ప్రశ్నించు పదము మొదట ఉండుటచేత దీనికి కేనోపనిషత్తు అను పేరు గలిగినది. ఇందు నాలుగు ఖండములు గలవు.

"మా గురుశిష్యుల నిద్దఱను పోషించుగాక. సార్థకమైన శక్తివంతమైన దానిని చేయుదుముగాక మేము చదివినది తేజస్సు గలదై యుండుఁగాక. ప్రాణము కన్నులు మొదలైన యంగములు సంతృప్తి పొందుఁగాక. ఉపనిషత్తులు దెలుపునది సర్వము బ్రహ్మమె. నేను బ్రహ్మమును నిరాకరింపక పోదును గాక, నన్ను బ్రహ్మ నిరాకరింపకపోవునుగాక, ఉపనిషత్తులలోఁ జెప్పఁబడిన ధర్మములు నాయందుఁ గలుగుఁగాక." అనునది ప్రార్థన.

"దేనిచే ప్రోత్సహింపఁబడి యీ మనస్సు ప్రాణము వాక్కు కన్నులు చెవులు పనిచేయుచున్నవి" అని శిష్యుఁడు గురువునడిగెను.

"ఆ పరబ్రహ్మము చెవికి వినునట్టి శక్తిని మనస్సుకు ఆలోచించు శక్తిని వాక్కునకు మాటాడు శక్తిని ప్రాణమునకు బ్రతికించు శక్తిని కంటికి చూచు శక్తిని ఇచ్చుచున్నది. ఈ శక్తులన్నియు ఇంద్రియములవే అను భావమును వాటి ఆత్మ వే అని తెలిసికొనువారు చనిపోయియు అమృతులగుదురు. ఆ బ్రహ్మమును కన్ను వాక్కు మొదలైనవి తెలిసికొనలేవు. దీనిని ఎట్లు తెలుపవలెనో యెఱుఁగము. అది మామూలుగా అందఱకుఁ దెలిసినదానికంటె వేఱైనది" అని మాకు పూర్వులు వివరించి చెప్పిరి.

వాక్కుగాని మనస్సుగాని కన్నుగాని చెవిగాని ప్రాణముగాని తెలుపలేనిదియు, వానికి మాటాడు శక్తిని ఆలోచించు శక్తిని విను శక్తిని బ్రతికించు శక్తిని ఇచ్చినదే పరబ్రహ్మముగాని మనము మామూలుగా పూజించు విగ్రహాదులు పరబ్రహ్మము గావు.

"నాకు బాగుగా బ్రహ్మస్వరూపము తెలియును అనుకొంటివా అది నీకు తెలియనట్లే. అధిదైవతములలో నున్న మూలతత్త్వమును మీమాంసింపవలసియున్నది" అని గురువు అనఁగా శిష్యుడిట్లు చెప్పును. "నాకు బాగుగా తెలిసినదనిగాని తెలియలేదనిగాని అసలే తెలియలేదనిగాని అనుకొనను" అని శిష్యుఁడిట్లు పలుకఁగా శ్రుతి యిట్లు చెప్పుచున్నది. "ఎవఁడు నాకు పూర్తిగా తెలియలేదనుకొనునో వానికి తెలిసినట్లే. ఎవడు నాకు పూర్తిగా తెలిసినదనుకొనునో వానికి తెలియనట్లే దానిని సరిగా గురువు చెప్పినపుడు తెలియును. తాను శక్తిని పొంది విద్యచే అమృతత్వమును పొందవలెను. ఈ జన్మలోనే సరిగా తెలిసికొంటివా నీ జన్మ సత్యము సార్థకమునగును. ఇంక ఇప్పుడు తెలిసికోవా నీకు మహానర్థము కలుగును జాగ్రత్త. ప్రతి జీవిలో నున్న బ్రహ్మమును దెలిసికొని ధీరులు అమృతులవుదురు.

## కథ – 1

బ్రహ్మము దేవులకొఱకు విజయము కలిగించినది. ఆ బ్రహ్మమువల్లఁ గలిగిన విజయము మావల్లనే గలిగినదని వారనుకొన్నారు. అప్పుడు వారిలోని మిథ్యాభిమానమును

దెలిసికొని వారికి నిజమును బోధింపఁ దలఁచి బ్రహ్మము ప్రత్యక్షమైనది. దానిని దేవులు అది యేమిటో తెలిసికొనలేక అగ్నిని వాయువును "మీరు వెళ్ళి అదేమిటో తెలిసికొనిరం" డనిరి. వారు దాని దగ్గరకు వెళ్ళఁగా అది మీరు ఎవరు మీరేమి చేయుగలరు? అని యడిగినది. అపుడు నే నగ్నిని అంతను గాల్చగలను అనెను. అపుడు ఒక గడ్డి పరకను ఎదుటగా పెట్టి సరే అయితే దానిని కాల్చ చూతము అనెను. అపుడది కొంచెమును కాల్పలేకపోయెను. అప్పుడు వాయువు వెళ్ళి నేను వాయువను అంతను ఎగుర గొట్టగలననెను. అయితే దీనిని ఎగురగొట్టు అనెను. అది కూడ ఆ గడ్డిపరకను కదపఁజాలఁ గదపలేకపోయెను. మాకిది యేమిటో తెలియదనెను. అపుడు దేవులు ఇంద్రుని వెళ్ళి తెలిసికొనమనిరి అప్పుడా యింద్రుఁడు దాని దగ్గరకు వెళ్ళఁగా అది మాయమయ్యెను. పిదప ఆకాశములో (బంగారు రంగు గల) స్త్రీ కనిపించగా దానిని యేమి ఇది యని యింద్రుడడిగెను. అది యిట్లు చెప్పెను. ఆ పూజ్యమైన వస్తువు బ్రహ్మము. దానివల్లనె మీరు విజయము పొందితిరని చెప్పెను. అపుడు ఇంద్రుఁడు దానిని బ్రహ్మముగాఁ దెలిసికొనెను. కనుక ఆ దేవతలు అగ్నివాయువులు తెలిసికొనుటకు ముందుగా వెళ్ళుటచే తమకంటె వారు గొప్పవారనియు వారి కంటే ఇంద్రుఁడు వెళ్ళి మొట్టమొదట తెలిసికొనుటచే అందరి కంటె ఇంద్రుడు గొప్పవాఁడని తెలిసికొనిరి. కన వారిలో ఇంద్రుఁడు గొప్పవాఁడయ్యెను. ఇది మెఱసినట్లు ఒక క్షణములో జరిగినది. దేవతలు వచ్చినట్లును వారు తెలిసికొన్నట్లును దేవతాపరముగా చెప్పఁబడుటచే దీనిని అధిదైవతమందురు. ఇది అధ్యాత్మపరముగా చెప్పుకొనవచ్చును. సాధకుడు

మనస్సులో కల్పించి ఇవి యన్నియు తెలిసికొనును. ఆ సర్వమునకు ఆ పరబ్రహ్మమే కారణమని తెలిసికొనును. అట్లు చెప్పుకొనుట అధ్యాత్మపరమైన యర్థము. సామాన్యులు సరిగా తెలిసికొనలేరుగాన దేవులు వచ్చినట్లుగాను దేవులు తెలిసికొన్నట్లుగాను చెప్పబడినది. బుద్ధిమంతులు తెలిసికొనగలవారు కాన వారికి అధ్యాత్మవిధముగా జెప్పబడినది. వృక్షసమూహము వనమైనట్లు ప్రాణి సమూహము పరబ్రహ్మము. కాన దానిని వనరూపముగా ఉపాసింపవలయును ఇదే యుపనిషత్తు. దీనిని సరిగా తెలిసికొన్నచో పాపము వీడి గొప్పదైన స్వర్గలోకమున ప్రతిష్ఠను పొందెదరు.

ఓం శాంతిః శాంతిః శాంతిః

## 3 - కఠోపనిషత్తు

ఇది కృష్ణ యజుర్వేదములోనిది. ఇది కఠశాఖలోనిది గాన కఠోపనిషత్తు అనబడెను. ఇందు మొదటి అధ్యాయములో మూడువల్లులు, రెండవ యధ్యాయమున మూడు వల్లులు గలవు.

వాజశ్రవసుండు యజ్ఞఫలమును గోరి తన సర్వస్వమును దానము చేసెను. ఆతనికి నచికేతుండను కొడుకు గలడు. తండ్రి ముసలి గోవులను దానము చేయుచుండ జూచి, "ఆవులు ఇదివరకు పాలిచ్చినవి ఇప్పుడివ్వలేవు. ఇదవఱకు ఈనినవి ఇప్పుడింక ఈనలేవు. ముసలివైనవి. అటువంటి ముసలి ఆవులను దానము చేసినచో ఆనందములు ఆనందములేనివి అనునట్టి

లోకములు గలుగును" అని మనస్సులో నచికేతుడనుకొని తండ్రితో ఇట్లు చెప్పుట మంచిది కాదని చెప్పలేక తానెవరికైన ఉపయోగపడుదును గదా అని తలంచి "తండ్రీ! నన్నెవరి కిచ్చెదవనెను. తండ్రి ఆమాట వినలేదు. అప్పుడు నచికేతుండు మూడుసార్లు అనెను. తండ్రికి విసుగు కలిగి నిన్ను యముని కిచ్చెదను పో" అని యనెను. అపుడు నచికేతుండిట్లనుకొనెను. "నేను చాలమందిలో మొదటివాండను. కాకపోతే రెండవవాండ నైన అగుదును. నన్నిట్లు తండ్రి ఎందుకిట్లనెను. నేను సేవ చేయంగలను. అని యనుకొని తండ్రి పలికిన మాట అసత్యము కాకూడదని తలంచి చూడు ఇదివరలో మనవాళ్ళు ఎట్లు జీవించి నారో పంటవలె మనుష్యుండు పండి ఎండును మరల పుట్టును". కనుక తండ్రీ! యన్న మాట ప్రకారము నన్ను యముని దగ్గ అకుం పంపుమని తండ్రితో అనంగా తండ్రి యముని దగ్గరకు పంపెను. నచికేతుండు యముని దగ్గరకు పోంగా ఆ యముం డింటిలో లేకపోవుటచే యముండు వచ్చువఱకు నీరైనను త్రాగక అక్కడె యుండిపోయెను. పిదప యముండింటికి వచ్చెను. అపుడు యముని భార్య యిట్లనెను. "ఈతండు మన యింటిలో నీరైనను త్రాగక యిట్లే యున్నాండు. అతిథియైన బ్రాహ్మణుండు గృహమునకు అగ్నివలె ప్రవేశించును. వానికిం గోపము రాకూడదు. ఓ వైవస్వతా! అతనిని శాంతపఱచుము. ఎవని యింటిలో బ్రాహ్మణుండు భుజింపక యుండునో వాని స్వర్గాదిఫలములును రాజ్యాదులును యజ్ఞఫలమును తవ్వించిన వాపికూప తటాకాదులు ఫలములును పుత్రులును పశువులును అన్నియును నశించును. కనుక వానిని ముందు శాంత పఱచుము" అనెను. అప్పుడు యముండు నచికేతుని జూచి

నీవు అతిథివైన బ్రాహ్మణుఁడవు. నీవు మా యింట భుజింప
కుండ మూఁడు రాత్రులున్నావు. నీకు నమస్కారము. నాకు
శుభము గలుగుఁగాక. నీవు మూఁడు రాత్రులు భుజింప
కున్నావు గాన నాకు ఆ పాపము తగులకుండుటకై నీకు మూడు
వరములిచ్చెదను అనెను. సరేయని నచికేతుడు "తనపై
తండ్రి కోపము లేకుండ శాంతుడై యుండి నీచే విడువఁబడి
నట్లు నమ్మునట్లుగా ఒక వరము గోరుచున్నాను. స్వర్గములో
ఏ భయము కలుగదు. ఆకలి దప్పికలు ముసలితనము ఉం
డవు. అక్కడివారు అమృతులవుదురు. అట్టి స్వర్గమిచ్చు
అగ్నిని గూర్చి చెప్పుము. ఇది రెండవ వరము" అనెను.
అపుడు యముఁడు స్వర్గమును గూర్చు నగ్నిని గూర్చి
చెప్పెను. అతడు చెప్పినది సరిగా విని ఎట్లు అగ్నిని హోమము
చేయవలెనో తిరుగ శ్రద్ధతోఁ జెప్పఁగా విని యముఁడు సంతో
షించి నీకింకొక వరము నిచ్చెదను, పుచ్చుకొనుము. ఈ వరము
చేత అగ్ని నీ పేరుతోనే ప్రసిద్ధి పొందఁగలదు. ఈ నచికేతా
గ్నిని మూఁడుసార్లు హోమము చేసినను జన్మ మృత్యువులను
దాటుదురు. శోకములేకుండ స్వర్గమున నానందించును అని
చెప్పి మూడవ వరము కోరుకొమ్మనెను అపుడు నచికేతుఁ
డిట్లనెను. మనుష్యుఁడు చనిపోఁగా ఆత్మ యున్నదని కొందఱు
లేదని కొందఱు అందురు. ఈ సందేహమును నీవు తీర్చుటయే
మూఁడవ వరము అనెను.

అప్పుడు నచికేతునితో యముడిట్లనియెను.

"ఈ విషయములో దేవులకు గూడ సందేహము కల్గినది.
ఇది సులువుగాఁ దెలిసికొనఁ దగినది కాదు. ఈ సంగతి అతి

సూక్ష్మమైనది. కావున నచికేతా! ఇంకొక వరము కోరుకో, ఇదే చెప్పుమని నన్ను బలవంతపెట్టకు. అనగా అపుడు నచికేతుడనెను. మంచిది దేవులకుఁ గూడ ఇందు సందేహము గలిగినది, అదిగాక ఇది సులువుగా తెలిసికోలేము అన్నావు కనుక నీవంటి చెప్పువాడు లభించిన తరువాత నాకు ఇంకొక వరమెందులకు. ఇంకొకఁడిది చెప్పలేడు దీనితో సమానమైన వరమింకొకటి లేదు కనుక నాకిదే చెప్పుము" అనెను. అపుడు యముఁడిట్లనెను. నూరేండ్లు జీవించునట్టి పుత్రులను పౌత్రులను కోరుకో. నీ యిష్టమున్నంత కాలము నీవు కూడ బ్రతుకు ఇదిగో రాజ్యము ఇరుగో అప్సరస స్త్రీలు, నీకింక ఏదైన కోరిక ఉంటే అది కోరుకో కని ఇట్టిది కోరకు; అన్నాడు ఇట్లు అనినను నచికేతుఁడు మానక అదే చెప్పుమన్నాడు. ధనముచేత మనుష్యుఁడు తృప్తి పొందడు. ఎంత ఉన్నను ఇంకను కావలయునని కోరును. నాకివి వద్దు అదే చెప్పుమనెను. అనఁగా యముడు ఇట్లు ఆత్మను గూర్చి చెప్పెను.

శుభము వేరు ప్రియము వేరు, రెంటికి ఫలములు వేర్వేరుగా నున్నవి. ఈ రెండును మనుష్యుని జేరుచుండును. అందులో శుభమును స్వీకరించువానికి మేలు కలుగును. ప్రియము కోరినచో వాఁడు సరియైన ప్రయోజనము పొందక హీనుడగును.

శుభవిషయములు ప్రియవిషయములు మనుష్యుని పొందును. కాని ధీరుఁడు శుభమునే కోరును. మందుఁడు తాత్కాలిక లాభమును జూచి ప్రియమునే కోరును శుభ ప్రియములు విరుద్ధగుణము గలవి. వానిలో శుభము విద్యయని ప్రియమును

అవిద్య అని అనవచ్చును. ఆ విద్యలో కూడ మేము ధీరులము పండితులమని తలంచు గ్రుడ్డివారిచేతను తీసికొని వెళ్ళఁబడు గ్రుడ్డివారివలె గోతిలో పడిపోదురు. పదవీ ధనాది వ్యామోహములు గల మూర్ఖులకు ఈ పరబ్రహ్మము లభింపదు. ఈ లోకమె (జన్మ) కాని యింకొక లోకము లేదనుకొనువాఁడు మాటిమాటికి నా వశమయిపోవును. దీనిని విందురుగాని తెలిసికోలేరు. దీనిని చెప్పువాఁడు పొందువాఁడు నేర్పరి. యిది తర్కమున కందదు.

అది బాహ్యమైన యింద్రియములచేఁ జూడరానిది హృదయమనెడి గుహలో నున్నది. దానిని అధ్యాత్మ యోగముతోఁ దెలిసికొన్న ధీరునికి హర్ష శోకములుండవు. దానిని అన్ని వేదములు చెప్పును. తపస్సులు బ్రహ్మచర్యము అందుకే మునులు చేయుదురు. దానిని సంగ్రహముగఁ దెలిసికొనవలెనంటే అది ఓంకారము. ఇదే అన్నిటికి ఆధారము. ఈ యోంకారముచేఁ తెలియఁదగిన ఆత్మ పుట్టదు చావదు, దేనివల్లను ఇది కాదు. ఇది స్వయముగనే ప్రకాశించుచుండును. శాశ్వతమైనది. శరీరము పోయినను ఇది యుండును. ఎవడైనను నేను చంపుదును అనినను నేను చచ్చిపోదును అనుకొన్నను వారు తెలియనివారే, శరీరము పోవును గాని ఆత్మ పోవదు. శక్తి ఎప్పుడును పోవునది కాదు. విద్యుచ్ఛక్తి పోదు. దానిని పైకి చూపు బల్బులు పోవును. అది అంతట వ్యాపించునది గాన భావనకే గాని కండ్లకుఁ గనిపించదు. అది అణువు కంటె అణువు మహత్తు కంటె మహత్తు. ఇది ప్రవచనముచేత గాని మేధచేఁగాని ఎక్కువ చదువుట చేతఁగాని పొందఁబడదు. ఈ ఆత్మను దెలిసికొనవలయునని కోరువానికి అదే తన ఆత్మీయ

రూపమును ప్రకటపఱచును. దుశ్చరిత్రల నుండి మోహము నుడి విరమించనివానికి శాంతి దొరకదు. జ్ఞానముచేత దానిని పొందవచ్చును.

లోకమున హృదయ గుహ ప్రవేశించిన జీవాత్మ పరమాత్మ అనునవి రెండు పక్షులు గలవు. అవి సుకృతమును అనుభవించుచుండును. జీవాత్మ నీడవంటిది పరమాత్మ ఎండ వంటివాడు. అందులో పరమాత్మ సాక్షి. ఆత్మ రథ యజమానుడు. ఈ శరీరము రథమువంటిది. బుద్ధి సారథి మనస్సు కళ్ళెము. ఇంద్రియాలు గుఱ్ఱములు విషయములును భోగములు మార్గములు ఇంద్రియ మనస్సులతోఁ గూడినది భోక్త యజమాని. యజమాని తన సేవకులవంటి యింద్రియాల మాట వినకూడదు అట్లు విన్నచో అవి యజమానిని వ్యామోహాదులలో కష్టాదులలో పడవేయును. విజ్ఞానమును లేనివాడు చంచల మనస్సుతో ఉన్నచో వానికి యింద్రియములనెడి చెడ్డ గుఱ్ఱములు లొంగవు. విజ్ఞానము గలవాడై స్థిరమైన మనస్సుతో ఉన్నచో మంచి గుఱ్ఱముల వలె ఇంద్రియములు లొంగును. యింద్రియములకంటె మనస్సు గొప్పది. యింద్రియములు, తాము తెలిసికొన్నవి మనస్సు అను సామాను గదిలోనికి తీసికొని వచ్చి పడవేయును. మనస్సుకంటె గొప్పదైన బుద్ధి వానిలోని మంచి చెడు వస్తువులను భావములను ఏరుకొని నడుపును. ఆ బుద్ధికూడ సామానుగదిలోని వానిని చెడ్డ భావములను ఏరుకొన్నచో అశుభములను పొందును. అందు కనియే మంచి బుద్ధిలేనివాఁడు తప్పులు చేసి కష్టాలపాలగును. మంచి బుద్ధి యున్నచో మంచివి ఏరుకొని శుభమును పొందును. ఆ బుద్ధి మంచిదిగా నున్నచో దానిని చిత్తమందురు.

అది చైతన్యము గలది దానికంటె జీవతత్త్వము గొప్పది. అది అవ్యక్తము దానికంటె ఆత్మ గొప్పది దానికంటె నింత గొప్పదేదియు లేదు. అందుచేత దానిని దెలిసికొనుటకు మీరు లెండు. పెద్దల దగ్గరకు పెళ్ళి తెలిసికొనుడు. అది కత్తియంచు వలె పదునైనది. అది తెలిసికొని పొందినచో వానికి జరా రోగ మృత్యువులుండవు. స్వయంభువు ఇంద్రియములను పై పై విషయములను గ్రహించువానిని మాత్రముగానే సృజించెను కాన అవి పై పైని మాత్రము చూచును ఒకానొక ధీరుడు తన యింద్రియములను భోగములనుండి మరలించి అంతర్ముఖము చేసికొని యమృతమును పొందును. అది జాగ్రత్స్వప్న సుషుప్త్యావస్థలను తెలిసికొని వానికి దూరమైన తురీయావస్థ యందుండును. అరణులయందు అగ్ని గూఢముగా నున్నట్లును జీవుఁడు గర్భములో నున్నట్లును అది ప్రాణుల హృదయములలో గూఢముగా నున్నది.

ఆ యాత్మ యొకటె. నుఁడుగు కెరటములు వేరైనను సముద్రము ఒకటే అగునట్లు జీవులు వేరైనను ఆత్మ యొక్కటే. అవి వేఱు అని భిన్నముగా తలచువాఁడు మృత్యువును పొందును. హృదయ ప్రదేశమును బట్టి ఆత్మ అంగుష్ఠమాత్రము వలె నుండును. శరీర మనుపురమున శయించువాఁడు పురుషుఁడు. రెండు కనులు రెండు చెవులు ఒక నోరు రెండు ముక్కులు శిరో రంధ్రము. నాభి మల మూత్ర ద్వారములు మొత్తము ఈ పదునొకటి శరీర మనెడి పట్టణమునకు ద్వారములు. అగ్ని వాయువులు ఒకటేయైనను ఎట్లు అన్నిటిని ప్రవేశించి అనేక రూపములు పొందునో అట్లు ఆత్మ, పుఁగులు,

పక్షులు, పశువులు, మనుషులగును. ఈ దేవులు శరీరముల బట్టి ఆయా రూపములలో నుందురు. శరీరములు బల్బులు వంటివి. ఆత్మ విద్యుత్తువంటిది. బల్బులు బ్రద్దలైనను విద్యుత్తు ఉండును. శరీరములు పోయినను ఆత్మ పోదు. అది అనిత్యములలో నిత్యము. అనేకములలో ఒకటి. అచేతనములలో చేతనము. దాని ప్రకాశము ముందు సూర్యుని ప్రకాశము చిన్నది. దాని ముందు ఈ చంద్ర నక్షత్రకాంతులు ఏపాటివి. దాని ప్రకాశము వలననే అన్నియు ప్రకాశించుచున్నవి.

ఈ ప్రపంచమనెడి మఱ్ఱిచెట్టునకు విష్ణువనఁగా వ్యాపకమైన యాత్మపదము పైనున్నది అది మూలము. ఊర్ధ్వమనగా ఉత్తమముగానున్న మూలము విష్ణుపదమున స్వర్గనరకాదులు దాని కిందనున్న కొమ్మలు. అది యున్నచో అన్ని ఉండును. అది లేనిచో ఏవియు ఉండవు అది లేకపోవుట అన్నది లేనే లేదు. దాని శాసనముచేతనే అగ్ని సూర్యుడు పర్జాధి దేవుడింద్రుఁడు. వాయువు మృత్యువు పని చేయుచుందురు. ఈ జన్మలోనే మనుష్య జన్మ పొందిన నీవు దానిని తెలిసికొనక పోయితివా మరల మరల పుట్టి కష్టములు పొందుదువు. ఆ యాత్మ మన హృదయములో అద్దములోని వస్తువవలె స్వచ్ఛముగాఁ గనిపించును. కలలోవలె పితృలోకమున, నీళ్ళలోవలె గంధర్వ లోకమున నీడ ఎండలవలె బ్రహ్మలోకమునఁ గనిపించును. జ్ఞానేంద్రియములైదు మనస్సు బుద్ధి ఇవి నిశ్చలముగా నున్నపుడు ధ్యానములో ఆ పరమస్థితి తోఁచును. అదే గొప్ప స్థితి. అది పై పై యింద్రియములకు గనిపింపదు గాన లేదను కొందురు. యోగులు దానిని తెలిసికొన్నారు కనుక మన

ఇంద్రియములకుఁ బైకిఁ గనిపింపనంత మాత్రమున అది లేదనరాదు. అది యున్నదని తలఁచి సాధన చేసినచో తత్త్వ భావముచే పొందదగియున్నది. ఉన్నదని సాధన చేసినచో దాని తత్త్వము దాని అస్తిత్వము అనుభవ గోచరమగును. కనులకు రూపమే కనుపించును చెవులకు శబ్దము. ఇట్లు ఆయా యింద్రియములకు ఆయా విషయములే కనిపించును. అవి రూపాదులచే సంకుచితములు గాన అవి కనిపించును. రూపాదులు లేనిది సర్వ వ్యాపకమైనది. సంకుచితమైన యింద్రియాలకు అది ఎట్లు గనిపించును. సర్వవ్యాపకమైన ఆత్మ భావనచే గ్రహించినచో తప్పక దాని తత్త్వము మనకు బోధపడును. మనలను పట్టుకొని యున్న కామపాశములు తెగినఁ గాని మనము అమృతులము గాము. మనలో హృదయము నుండి బయలుదేరిన నాడులు నూట ఒకటి యున్నవి. అవి ఇంద్రియముల వైపు వెళ్ళినవి యింద్రియములను విషయములను మాత్రము గ్రహించును. శిరస్సులోనికి వెళ్ళినది యాలోచనాగమ్యమైన యాత్మతత్త్వమును గ్రహింపఁ జేయును. అందులో ఒకటి సుషుమ్న అను నాడి అన్నిటినీ చీల్చుకొని శిరస్సున బ్రవేశించును. అందుచే ధ్యాన ప్రాణాయామాది సాధనముల ద్వారా దానిని మేల్కొలుపవలయును. అది మనలను అమృతత్వము వైపునకుఁ దీసికొని వెళ్ళును. మిగిలిన నాడులు చావు వైపునకు దీసికొనిపోవును. మనలోని ఆత్మ పురుషుని దర్భముడి నుండి పోచను వలె ధైర్యముగా సూక్ష్మ బుద్ధితో తీసినచో అది గ్రాహ్యమగును. అదే అమృతము.

ఈ విధముగా యముఁడు నచికేతునికి తత్త్వమును

సమస్త యోగవిధిని చెప్పెను. అపుడు ఆ నచికేతుడు రజో గుణము లేనివాఁడై బ్రహ్మమును పొందెను. అట్లే ఇతరులును దీనిని సరిగాఁ దెలిసికొని గ్రహించి జీవితానుభవములోనికిఁ దెలిసికొని ఆచరించినచో వారును బ్రహ్మమును పొందుదురు

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.

## ప్రశ్నోపనిషత్తు

ఇది యథర్వ వేదములోనిది. ఇందు సుకేతుఁడు, సత్యకాముఁడు, గార్గ్యుఁడు, పౌలస్త్యుఁడు వైదర్భి కబంధి అనువారు పిప్పలాద మహర్షిని సమీపించి యడిగిన ప్రశ్నలును వానికి పిప్పలాదుఁడు చెప్పిన జవాబులును గలవు. ఈ ప్రశ్నలను బట్టి దీనికి ప్రశ్నోపనిషత్తు అను పేరు గల్గినది. ఇందు ఆఱు ప్రశ్నలు గలవు.

సుకేశుఁడు మొదలగువారు బ్రహ్మమందు నిష్ఠ గలవారై బ్రహ్మమును అన్వేషింపఁదలఁచి పిప్పలాద మహర్షి దగ్గఱకు భక్తితో దర్భలు చేతధరించి వచ్చిరి. అప్పుడు వారితో మీరింకను తపస్సుచేసి బ్రహ్మచర్యముతో ఒక సంవత్సరము ఉండి మీ యిష్టము వచ్చినట్లు ప్రశ్నలు అడుగుఁడు నాకు దెలిసినచో చెప్పెదననెను.

అందులో కబంధి ఒక యేఁడాది తరువాత వచ్చి యడిగెను. ఓ భగవంతుడా ఈ ప్రాణులన్నియు దేనినుండి పుట్టుచున్నవి అని.

అపుడు పిప్పలాదుఁడనెను.

ప్రాణులను సృజింపఁ దలచి సంకల్పముచే అన్నము ప్రాణము అను జంటను సృజించెను. సూర్యుఁడె ప్రాణము. చంద్రుఁడె అన్నము, రూపములేనిది అమూర్తము ప్రాణము దానిచేఁ దినఁబడునది మూర్తిగలది. అన్నము అది మూర్తము అనఁబడినది.

సూర్యుఁడు ఉదయించి అన్ని వైపుల కిరణములను ప్రసరింపఁ జేసెను. ఆ ప్రాణము వైశ్వానరుఁడు సూర్యుడు అగ్నియునై యుండెను. సంవత్సరమె ప్రజాపతి దానికి ఉత్తరాయణ దక్షిణాయనములు అని రెండు అయనములు. ఎవరు యాగము తపస్సు సత్యము వేదపాఠము అతిథిపూజ వైశ్వదేవము అను ఇష్టములను, నూయి చెఱువు గుడి అన్న దానము తోట అను పూర్తములను జేయుదురో వారు చనిపోయి చంద్రలోకమును పొందుదురు. వారు తిరిగి పుట్టుదురు. కాన సంతానము కోరు ఋషులు గృహస్థులై ఈ దక్షిణాయనము ద్వారా చంద్రుని పొందుదురు. దీనిని పితృయాణమందురు. కొందరు తపస్సు చేసి బ్రహ్మచర్యముచే శ్రద్ధచే జ్ఞానముచే ఆత్మను గన్గొని యుత్తరాయణము ద్వారా సూర్యలోకము పొందుదురు. దానిని దేవయానమందురు. దానిని పొందిన వారు తిరిగి పుట్టక శాశ్వతానందము పొందుదురు. మాసము కూడ ప్రజాపతియె. కృష్ణపక్షమె అన్నము. శుక్లపక్షమె ప్రాణము. కాన ఋషులు శుక్లపక్షమందె యజ్ఞాదులు నిరంతరము శ్రద్ధతోడ చేయుదురు. రాత్రింబగళ్ళు కూడ ప్రజాపతి రూపములె. రాత్రి అన్నము పగలు ప్రాణము పగలు స్త్రీని గలిసినవారు ప్రాణము నశింపఁజేసి కొందురు. రాత్రియందు గలిసినవారిది బ్రహ్మచర్యమె. అన్నమును ప్రజాపతిరూపమె

ఆ యన్నము నుండి వీర్యము అందునుండి ప్రజలు పుట్టుదురు. అట్టి ప్రజాపతి వ్రతము చేయువారు ఉత్తములను గందురు. ఎవరియందు తపస్సు బ్రహ్మచర్యము సత్యము ఉన్నదో వారు బ్రహ్మలోకము పొందుదురు. ఎవరియందు కపటము అసత్యము మాయ లేదో వారు దేవయానమనెడి బ్రహ్మలోకము పొందుదురు.

2 పిదప వైదర్భి వచ్చి యిట్లడిగెను :-

ఓ భగవానుఁడా! ఎంతమంది దేవులు (ఇంద్రియములు) దేహమును ధరించుచున్నారు. ఎంతమంది దీనిని ప్రకాశింపఁ జేయుదురు. వీరిలో ఎవరు శ్రేష్ఠులు. ఇంద్రియములు ప్రకాశించునవి గాన దేవులు అనఁబడెను. అపుడు పిప్పలాదుడనెను. ఆకాశము అగ్ని నీరు నేల వాక్కు మనస్సు అను దేవులు తమ శక్తిని చూచికొని మేమే ఈ శరీరమును ధరించుచున్నాము. మేము గొప్పవారము అని ఎవరికివారే అనుకొనిరి. అపుడు ప్రాణము అనెను. మీరు మోహము పొందకుఁడు ప్రాణాపాన వ్యాన సమానోదానములను పేరులతో ఆయాచోట్ల శరీరమును ధరించుచున్నాను. అనఁగా అవి యేవియు ఈ మాటలను లెక్కపెట్టలేదు. అపుడు అభిమానపడి ప్రాణము లేచిపోవుటకు ప్రయత్నింపఁగా అన్నియు పనిచేయక అవి పోయినట్లయినవి. అది నిలవగా అన్నియు నిలిచినవి. రాణి ఈగ ఉండగా ఈగలన్నియు నిలచినట్లు నిలచినవి. అపుడు ఆ యింద్రియములన్నియు ప్రాణమును స్తోత్రము చేసినవి. నీవు అగ్నివి సూర్యుఁడవు. వాయువవు చంద్రుఁడవు సత్తు అసత్తు నీవే బండికంటిని ఆకులు ఆశ్రయించినట్లు ఋక్కులును యజుస్సులు సామములు యజ్ఞము బ్రహ్మచర్యము అన్నియు

ప్రాణమందె నిలచియున్నవి. నీవు ప్రజాపతివి. ఇంద్రుఁడవు. నీవు మేఘుడవై వర్షించినచో ఈ ప్రజలు బ్రతుకుదురు. సంస్కారము లేకపోయినను నీవు శుద్ధుఁడవె. నీవే మా యందలి యందున్నావు. తల్లివలె మమ్ము రక్షింపుమనెను. అందుచేత ప్రాణమె యింద్రియ రూపమై శరీరమును ధరించుచున్నది. అదె అన్నిటిలో శ్రేష్ఠము" అనెను.

పిదప కౌసల్యుఁడు వచ్చి యిట్లడిగెను.

భగవానుఁడా! దేనినుండి యీ ప్రాణము పుట్టుచున్నది. పుట్టి ఎట్లు ఈ శరీరమును ప్రవేశించుచున్నది. తన్ను ఎట్లు విభజించికొన్నది. ఎట్లు ఈ శరీరమును విడచిపెట్టుచున్నది. ఎట్లు పై భూతములను లోని ఆత్మను ధరించుచున్నది" అని.

పిప్పలాదుఁడనెను. "నీవు విషమ ప్రశ్నలను అడుగుచున్నావు. నీవు బ్రహ్మిష్ఠుడవని నీకు చెప్పుచున్నాను. విను."
"ఆత్మ నుండి ప్రాణము పురుషుని నుండి నీడవలె బయలుదేరి శరీరమునఁ బ్రవేశించుచున్నది. రాజు అయా గ్రామములందు ఆయా యుద్యోగస్థులను నియమించినట్లు ప్రాణము మల మూత్ర ద్వారములందు అపానమును కండ్లు చెవులు నోరు ముక్కులందు స్వయముగా ప్రాణమను పేరుతో శరీరాగ్ని యందు హోమము చేయఁబడిన అన్నము సమానముగా నడుపును? కండ్లు మొదలైనవి ఏడు జ్వాలలు. హృదయమందు నూటయొక్క నాడులున్నవి. ఒక్కొక్క నాడియందు 72 నాడుల చొప్పున మొత్తము 72000 నాడులు గలవు. వాని యందు వ్యానమను వాయువు చరించును. అందులో సుషుమ్న నాడిద్వారా పైకి పోవును. బాహ్యతేజస్సె యుదానవాయువు.

జీవకర్మలు ముగిసిన పిదప మనస్సులో లీనమైన యింద్రియములలోఁ గూడ తన సంకల్పముచే మరియొక శరీరమును పొందించును. ఇట్లు సరిగా తెలిసికొని ప్రాణము పుట్టుకను రాకను సంకల్పమును బట్టి శరీరములో ఉండుటను ప్రభువుగా నుండుటను తెలిసికొన్నవాడు అమృతుడగును.

4 పిదప గార్గ్యుఁడు పిప్పలాదుని అడిగెను.

భగవానుఁడా! ఈ పురుషునిలో ఏవి నిద్రించుచున్నవి. ఏవి మేల్కొనుచున్నవి. ఏ దేవుఁడు కలలు కనును. వీనికెట్టి సుఖము కలుగును దేనియందు ఇంద్రియములు లీనమగుచున్నవి అని యడిగెను. అప్పుడు పిప్పలాదుఁడనెను.

గార్గ్యుఁడా! అస్తమించు సూర్యునిలో ఎట్లు కిరణములు లయించుచున్నవో అట్లే యింద్రియములు మనస్సున లయించుచున్నవి. అందుచే వాఁడు వినఁడు చూడడు పలుకఁడు. అప్పుడు నిద్రించుచున్నాఁడందురు. చెవులు మొదలైనవి నిద్రింపగా ఈ ప్రాణాది పంచాగ్నులు శరీరమను పట్టణములో మేల్కొని యుండును. అపానము గార్హపత్యాగ్ని వంటిది. వ్యానము దక్షిణాగ్ని ప్రాణము అవహనీము. ప్రాణాహుతులను సమానముగా వడుపుట సమానమనఁబడెను. మనస్సె యజమానుడు యాగఫలమె యుదానము. అది బ్రహ్మమనెడి స్వర్గమును పొందించును. అప్పుడు మనుష్యుడు స్వప్నములో అనేక శక్తులను పొందును. అనుభవించిన వన్నియు గ్రహించును.

చూడని వానిని వినని వానిని గూడ చూచును. వినును. అప్పుడు శరీరములో ప్రవేశించి శబ్దస్పర్శాది విషయములను పొందును. ఆనందమును పొందును. ఇతండె ద్రష్ట స్రష్ట శ్రోత భోక్త కర్త. అతడు అక్షర పరమాత్మయందు ఉండును అనెను.

పిదప సత్యకాముండు వచ్చి పిప్పలాదుని నడిగెను.

భగవానుండా! ఎవండు చనిపోవు వఱకు ఓంకారమును ధ్యానించునో వాం డేలోకమును పొందును అని. అప్పుడు పిప్పలాదుండనెను.

ఓంకారమును ధ్యానించువాండు అపర బ్రహ్మమగు ప్రాణమును పరబ్రహ్మమగు పరమాత్మను ఈ రెంటిలో దేని నైనను పొందును. అ ఉ మ్ అను విభాగమునుగాక ఓం అని ఏకముగా ధ్యానించువాండు జగతిలో పుట్టును. ఋక్కులు మనుష్య లోకము పొందించును. అక్కడ బ్రహ్మచర్యముతో శ్రద్ధతో గొప్ప మహిమను పొందును. అ ఉ మ్ అని రెండు మాత్రలుగా ఓంను ధ్యానించువాండు చనిపోయిన పిదప అంత మున యజుస్సులచే చంద్రలోకమును పొంది అక్కడ సుఖము అనుభవించి తిరుగ భూలోకమందు పుట్టును. ఎవండు అ ఉ మ్ మూండు మాత్రలను బ్రహ్మ దృష్టి లేకుండం బలికినచో అవి మృత్యువును గూర్చును. అట్లుగాక ధ్యానములో జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలందు అ ఉ మ్ అను మాత్రలను ఒకదానితో గలిపి ఏక బ్రహ్మ విషయముగాం బ్రయోగించినచో విద్వాం సుండు చలనము పొందడు. ఋక్కులచేత ఈ లోకమును యజుస్సుల చేత అంతరిక్షమును సామల చేత బ్రహ్మమును

బొందును. ఆ మూడు లోకాలవలన ఈ యోంకారము చేతనే జరామరణ రహితమైన నిరతిశయ బ్రహ్మమును బొందును.

పిదప సుకేశుఁడు వచ్చి పిప్పలాదుని అడిగెను. భగవానుడా! కోసలరాజ పుత్రుఁడు హిరణ్యనాభుఁడు నా దగ్గఱకు వచ్చి భరద్వాజ! నీవు షోడశకళలు గల పురుషుని నెఱుఁగుదువు చెప్పుమనెను. అప్పుడు నేను ఆ రాజకుమారునితో నిట్లంటిని. దీని నే నెఱుగను తెలిసినచో ఎందుకు చెప్పను. అసత్యమాడు వాఁడు సమూలముగా నశించును. అనఁగా అతడు వెళ్ళిపోయెను. ఆ ప్రశ్నను నిన్నడుగుచున్నాను. ఈ పురుషుఁ డెక్కడ నున్నాఁడో చెప్పుము. అనగా పిప్పలాదుఁడనెను. ఓ సౌమ్యుఁడా! ఏ హృదయములో ప్రాణమునుండి శ్రద్ధను ఆ శ్రద్ధ నుండి ఆకసము గాలి జ్యోతి నీరు భూమి అయిదు ఇంద్రియములు మనస్సు అన్నము తపస్సు మంత్రకర్మలు లోకములు అందు నామములు గలిగినవో ఆ హృదయమందె పురుషుఁడు పరమాత్మను తెలిసికొనఁదగి యున్నాఁడు. నదులు సముద్రమును పొంది తను నామ రూపములు పోగొట్టుకొని సముద్రమని చెప్పఁబడునట్లు పై పదునాఱు కళలును పురుషునిలో నైక్యమై పురుషుఁడనియె చెప్పబడును. అప్పుడు వానిని మృత్యువేమియు జేయలేదు. అమృతుఁడగు నవి చెప్పగా వినెను. ఇట్లు ఆ శిష్యుల ప్రశ్నలకు పిప్పలాదుఁడు జవాబులు చెప్పగా నీవు మమ్ము అజ్ఞానము నుండి అవతలి యొడ్డునకుఁ జేర్చితివి. నీకు ఋషులకు నమస్కారము అని వారు నమస్కరించి వెళ్ళిపోయిరి.

ఇది ప్రశ్నోపనిషత్తు

— () —

# ముండకోపనిషత్తు

ఇది అథర్వ వేదములోనిది. ఇది మనుష్యుల వాసనలను బంధములను ముండనము (=ఖండనము) చేయునది కనుక ముండకోపనిషత్తు అని పేరు గలిగెను.

ఇందు మొదటి ముండకమున రెండు ఖండములు రెండవ ముండకమున రెండు ఖండములు మూఁడవ ముండకమున రెండు ఖండములు గలవు.

మేము చెవులచేత భద్రములు విందుము గాక. ఇంద్రుడు సూర్యుఁడు గరుత్మంతుఁడు బృహస్పతియు మాకు శుభము లిచ్చు గాక.

దేవతలలో బ్రహ్మ మొదటివాఁడు. అతఁడు సర్వులకు ఆధారమైన బ్రహ్మవిద్యను అధ్వర్యునికి అతఁడు అంగిరసునికి సత్యవహునికిని జెప్పెను. ఆ సత్యవహుని దగ్గరకు శౌనకుఁడు వచ్చి "ఏది తెలిసికొన్నచో అంతయుఁ దెలియునో అది చెప్పమని అడిగెను. అపుడు అతఁడు శౌనకునికి ఇట్లు చెప్పెను."

పర, అపర అని రెండు విద్యలని బ్రహ్మవేత్తలు చెప్పుదురు. అపర విద్య అనఁగా ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, శిక్ష, కల్పము, వ్యాకరణము, నిరుక్తము, ఛందస్సు, జ్యోతిషము అనునవి.

దేనిచే క్షరము (నాశము) కాని బ్రహ్మము తెలియునో అది పరవిద్య యనఁబడును. అది యిట్టిదని చూడరానిది గ్రహింపరానిది. దానికి కులము జాతులుగాని ఇంద్రియాలు గాని లేక జగత్తున వ్యాపించి సూక్ష్మమై అన్ని ప్రాణులకు

ఆధారమై యుండును. దానిని ధీరులు చూతురు ఎట్లు సాలె పురుగు నూలు విడచునో, నూలును తనలో లయింపఁజేసి కొనునో, ఎట్లు భూమియందు ఓషధులు బయలుదేరి అందె లయమొందునో ఎట్లు జీవించిన పురుషుని నుండి కేశ రోమ ములు బయలుదేరునో అట్లే యీ యక్షర పురుషుని నుండి ఈ ప్రపంచమంతయు పుట్టుచున్నది.

తపస్సుచే బ్రహ్మము పొందఁబడును. ఆ బ్రహ్మము నుండి అన్నము అన్నము నుండి ప్రాణము బయలుదేరును. దానినుండి మనస్సు దానినుండి సత్యము దానినుండి లోక ములు, వానినుండి కర్మలు, వానినుండి యమృతము బయలు దేఱుచున్నవి. ఆ బ్రహ్మము నుండియే నామ రూపములును పుట్టుచున్నవి.

వైదిక మంత్రములందుఁ గవులు దర్శించినవి అన్ని యుగములలో వ్యాపించి యున్నవి. ఇదే సుకృతమునకు మార్గము. మండెడి యగ్నియందు ఆహుతులను వ్రేల్చవల యును. ఎవని యింట అగ్నిహోత్రము దర్శ (అమావాస్య) పౌర్ణమాస కర్మలు చాతుర్మాస్యలు ఆగ్రియణము అతిథులు లేకయుండునో హోమములు వైశ్వదేవములుండవో ఆ యగ్ని హోత్రము వాని యేడు లోకములను నశింపఁజేయును. కాళి, కరాళి మనోజవ సులోహిత ధూమ్రవర్ణ స్ఫులింగిని విశ్వరుచి అనునవి యగ్ని జ్వాలలు. ఈ జ్వాలల ద్వారా హోమము చేయు యజమానుఁడు సూర్యకిరణముల ద్వారా దేవాధిపతి యుండు చోటికిఁ బోవును. ఇదిగో మీ కర్మవల్ల వచ్చిన పుణ్య మైన బ్రహ్మలోకము అని సూర్యరశ్ములు ఆహ్వానించును.

పదారుగురు ఋత్విక్కులు యజమానుఁడు భార్య అను ఈ పదు నెనిమిది యజ్ఞరూపమైన నావలు. ఈ మార్గము తక్కువది. ఇదే శ్రేష్ఠమనుకొనువారు చావుపుట్టుకలు పొందుదురు. అజ్ఞానములో నుండువారు మేమే పండితుల మనుకొందురు. వారు గుడ్డివారు వలె జనన మరణముల చక్రములోఁ బడుదురు. ఇష్టా పూర్తములను (యాగాదులు| వాపీకూపాదులను) శ్రేష్ఠముగా తలచువారు స్వర్గములో సుఖాలు అనుభవించి తిరుగ ఆ పుణ్యమైపోయిన తరువాత ఈ మనుష్య లోకమును గాని పశుపక్షి కీటాది నరకములనుగాని పొందుదురు.

తపస్సు శ్రద్ధ గలిగి అరణ్యములలో శాంతులై భిక్షాచర్యము చేయుచున్న వారు సూర్యుని ద్వారా ఆ బ్రహ్మమున్న చోటికిఁ బోవుదురు. వీని నన్నిటిని సరిగా తెలిసికొనుటకు దర్భ పవిత్ర ప్రాణియై గురువు దరికిఁబోయి తెలిసికొనవలెను.

నిప్పు నుండి అనేక వేల నిప్పు కణములు బయలుదేఱునట్లు అక్షరు పురుషుని నుండి వివిధ జీవులు పుట్టును. వీని నుండి అగ్ని చంద్ర సూర్యులు వేదాలు కాలాలు లోకాలు బయలుదేరును. దేవతలు మనుష్యులు అందఱు ఆహారములు తపస్సు, శ్రద్ధ సత్యము అన్నియు బయలుదేఱును. వానిలో యింద్రియము లేడును సమిధలు వంటివి. దీని నుండియె సముద్రాలు పర్వతాలు సకలము బయలుదేఱుచున్నవి.

ఉపనిషత్తులు అనుధనుస్సు గ్రహించి అందులోని మంత్రము లనెడి బాణములచే అక్షర బ్రహ్మమును కొట్టి పొందవలెను. ఓంకారము ధనుస్సు, బాణము ఆత్మ, బ్రహ్మము

లక్ష్యము. పొరపాటు లేకుండ దానిని గొట్టినచో దానితో సైక్యము పొందును. దానియందె యన్నియుఁ గలవు కనుక ఆత్మనే తెలిసికొనుడు. ఇతర వాక్కులు విడిచిపెట్టుడు. ఇదే అమృత మార్గమునకు తీసికొనిపోవును. బండి కంటి యందు ఆకులు ఉన్నట్లు ఈ ఓంకారమందె అన్నియు నున్నవి. అట్టి బ్రహ్మమును చూచినచో హృదయ గ్రంథులు విడిపోవును. వీని కర్మలు క్షీణించును. దాని ప్రకాశము ముందు ఈ సూర్యాదుల ప్రకాశమేపాటిది. దాని జ్వాలవల్లనే ఇవన్నియు ప్రకాశించుచున్నవి. అన్ని యెడల నున్నది బ్రహ్మము.

మంచి ఱెక్కలు గలిగి స్నేహముతో నున్న పక్షుల వంటివి ఈ జీవాత్మ పరమాత్మలు. అవి ప్రపంచ మను చెట్టు నాశ్రయించి యున్నవి. అందులో జీవాత్మ పక్షి యిష్ట ఫలమును భుజించు చుండును. రెండవ పరమాత్మ అను పక్షి ఏదియు భుజింపక సాక్షియై యుండును. సాధకుఁడు బంగారు రంగు గల హిరణ్య బ్రహ్మకుఁ గారణమైన బ్రహ్మమును చూచువాడు నిర్లిప్తుఁడై అద్వైత తత్త్వమొందును. చివరకు సత్యమే జయించును. అసత్యము జయింపదు అది వాక్కుల కందదు. జ్ఞానప్రసాదమువల్ల శుద్ధమైన దానిని ధ్యానింప అది తెలియనిది గాదు. ఇది అణువైనది. మనుష్యుఁడెట్టి కోరికలు కోరునో అట్టి లోకమునే పొందును. కనుక సైశ్వర్యము కోరువాడు బ్రహ్మమునే ధ్యానింపవలయును. ఇది కేవలము ప్రవచనము చేతను మేధచేత శాస్త్రములచేతను పొందబడదు. అవి తెలిసికొని బ్రహ్మమును పొందగోరు వానికి ఆ బ్రహ్మమె తన్నుఁ బ్రకాశింపఁ జేయును. జీవులు ఆ యా కోరికలను

గోరుచు దాని నిచ్చుటకు బ్రహ్మమును కోరుదురు. కాని బ్రహ్మ కావలయునని ఎవరు కోరరు బ్రహ్మము కావలయునని కోరుదురో వారికెప్పుడు బ్రహ్మము అహ్వానించు చుండును.

ప్రవహించుచు నదులు ఎట్లు సముద్రమును గలిసి నామ రూపాదులను విడుచునో అట్లే విద్వాంసుఁడు బ్రహ్మమును పొంది నామ రూపాదులను వీడి బ్రహ్మైక్యమును పొందును. బ్రహ్మవేత్త కులములో బ్రహ్మవేత్త కానివాడు పుట్టడు.

దీనిని పూర్వము అంగీరసుఁడు అను ఋషి చెప్పెను. ఋషులకు పరమ ఋషులకు నమస్కారములు.

## మాండుక్యోపనిషత్తు 6

ఇదియు అథర్వ వేదము లోనిదె.

ఇది మండూక ఋషిచే దృష్టము గాన మాండూక్యమని పేరు గలిగినది.

మనము మన యింద్రియములచే భద్రమైన విషయము లనె విందుము గాక. ఇంద్రాదులును మనకు శుభము గలిగింతురు గాక.

ఓం కారమె సర్వము, అ + ఉ + మ్ లు బ్రహ్మ విష్ణు మహేశ్వరుల కర్మలను దెలుపును. అవతి రక్షించును అనియుఁ గూడ మనము వ్యుత్పత్తి చెప్పవచ్చు. సర్వకాలములు సర్వ లోకములును దానికి వ్యాఖ్యానము.

ఇదంతయు బ్రహ్మమె. ఇది జాగ్రదవస్థ స్వప్నావస్థ, సుషుప్తావస్థ తురీయావస్థ అను నాలుగు పాదములు గలది.

జాగ్రదవస్థ గలిగి బాహ్య ప్రజ్ఞ గలిగి ద్యులోకమను శిరస్సు, సూర్యుఁడను కన్ను, వాయువను ప్రాణము, ఆకాశమను మధ్య నీరను మూత్రము, భూమి అను కాళ్ళు, ఆవహనీయాగ్ని అను ముఖము ఈ యేడు అంగములు-చర్మ కన్ను చెవి నాలుక ముక్కు వాక్కు చేతులు కాళ్ళు మర్మేంద్రియములు ప్రాణాపానాదులు, మనస్సు, బుద్ధి, చిత్తాహంకారములు అని దీని ముఖములు పందొమ్మిది. స్థూలమగు శబ్దాది విషయముల ననుభవించు నట్టి వైశ్వానరుఁ డనునది మొదటి పాదము.

స్వప్నావస్థలో బహిరింద్రి యాపేక్ష లేకయే మానసిక ప్రజ్ఞ గలిగి విషయములను చూచుటచే తైజసుడని ఈ చూచువానిని అందురు. ఇది రెండవ పాదము.

ఇంక నిద్రించి ఏ కోరికను ఏ కలను పొందక యుండువాఁడు ప్రాజ్ఞుఁడు. ఇది మూడవ పాదము.

ఏ ప్రజ్ఞ లేక ఇట్టిదని చెప్పరాక ఒకటే ఆత్మ అని మాత్రము చెప్పఁదగినది నాల్గవ పాదము. ఈ యాత్మ ఓంకారముచేఁ దెలుపబడును. అందులో అ + ఉ + మ్ అన్నవి మాత్రలు మరియు పాదములు కూడ జాగ్రదవస్థలో అకారము వైశ్వానరుడు ఉకారము స్వప్నావస్థలోనిది తైజసుఁడు సుషుప్త స్థానము మ్కారము. ఇవి సరిగా తెలిసినవాడు ఓంకారము ద్వారా ఆత్మరూపము నొందును.

నాల్గవదియైన ఓం కారము శుభమైనది. అద్వైతమైనది. దీనిని తెలిసినవాఁడు ఆత్మతో ఆత్మను పొందును.

ఈ యుపనిషత్తుకు మాండుక్య కారికలు అను పేరుతో శ్రీ గౌడపాదులు వ్రాసిన కారికలు కలవు. దానిలో అగమ ప్రకరణము, వైతథ్య ప్రకరణము, అద్వైత ప్రకరణము, అలాతశాంతి ప్రకరణము అను ప్రకరణములు గలవు.

## తైత్తిరీయోపనిషత్తు 7

ఇది కృష్ణ యజుర్వేదము లోనిది. యాజ్ఞవల్క్యుడు వైశంపాయనుని శిష్యుఁడు. పూర్వము మునులు మేరు నగరమునకుఁ బోయి మునులందఱు ఏడు దినములలో ఇక్కడికి రావలయును. అట్లు రానిచో బ్రహ్మహత్యా పాపము అంటుకొనునని రి. వైశంపాయనుఁడు వెళ్ళలేకపోవుటచే బ్రహ్మహత్యా పాపమంటుకొనెను. "నా పాపము కష్టముగా నున్నది మీరు భరించుఁడు" అని వైశంపాయనుఁడు శిష్యులతోఁ జెప్పెను. అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు "ఇదెంత పని వీరందరెందుకు మీ పాపము నేనే భరించి నా విద్యచే సులువుగా దానిని పోగొట్టుదు నవెను. అతని గర్వమునకుఁ గోపమువచ్చి వైశంపాయనుఁడు నా విద్య లన్నియు నాకిచ్చి వేయుము అనెను. అప్పుడు యాజ్ఞవల్క్యుఁడు తాను వైశంపాయనుని దగ్గఱఁ జదివిన కృష్ణ యజుర్వేదమును కక్కివైచెను. అపుడు దానిని దేవతలు తిత్తిరి పక్షుల రూపమున వచ్చి భక్షించిరి. దానిని మరల ప్రకాశింపఁజేసిరి. ఆ తిత్తిరిపక్షుల వలన ప్రకాశింపఁబడినది. తైత్తిరీయ సంహిత. ఇది దానిలోనిది గాన తైత్తిరీయోపనిషత్తు అని యితిహాసము.

ఇందు శిక్షావల్లి బ్రహ్మానందవల్లి భృగువల్లి అను మూడు

వల్లులు గలవు. బ్రహ్మానందవల్లిలో తొమ్మిది అనువాకములు, భృగువల్లిలో పది అనువాకములు గలవు.

మాకు సూర్యుడు శుభమిచ్చుఁ గాక! వరుణుడు అర్యముడు, ఇంద్రుడు, బృహస్పతి, విష్ణువు శుభమిత్రుడు గాక! బ్రహ్మమునకు నమస్కారము. ఓ వాయూ! నీవే ప్రత్యక్ష బ్రహ్మవు. నిన్నే ప్రత్యక్ష బ్రహ్మముగాఁ జెప్పెదను. ఋతమును సత్యమును బలికెను. అది నన్ను ప్రక్కను రక్షించుఁ గాక.

అకారాదులు: ఉదాత్తాను దాత్త స్వరితములు అన్నవి స్వరములు. హ్రస్వ దీర్ఘములు మాత్రలు. వర్ణాదులను ఉచ్చరించు ప్రయత్నము బలము. సమముగా వర్ణములను పలుకుట సామము కలిపి ఉచ్చరించుట సంహిత. ఈ సంహితోపనిషత్తు (కలిసి చెప్పిన యుపనిషత్తు) అధిలోకము అధిజ్యోతిషము అధి విద్యము అధిప్రజము అధ్యాత్మికము అను నైదు విషయముల దృష్టితోఁ జెప్పఁబడినది: వీనిని మహా సంహితలందురు.

భూమి మొదటి రూపము, దినముపై నున్న రూపము ఆకాశము ఆ రెండిటికి సంధి అంతరిక్షము. వానిని కలుపునది వాయువు. ఇట్లు ప్రపంచరూపము లోకదృష్టితోఁ జెప్పఁబడినది. ఇది అధిలోక మనఁబడును.

అగ్ని మొదటిరూపము సూర్యుఁడుపై రూపము జలము సంధి మెఱపులు వానిని సంధానపఱచునవి. ఇవి జ్యోతిస్సుల రూపముగాఁ జెప్పఁబడెను. కనుక అధిజ్యోతిషమనఁబడెను.

ఆచార్యుఁడు మొదటిరూపము శిష్యుడు. పై రూపము. విద్య సంధి ప్రవచించు ప్రవచనము వారిని కలుపునది. ఇది అధి విద్యమనఁ బడినది.

తల్లి మొదటి రూపము తండ్రి పై రూపము. సంతానము సంధి కనుట సంధానము. ఇది అధిప్రజమనఁబడినది.

క్రింది దవడ మొదటి రూపము పై దవడ పై రూపము వాక్కు సంధి. నాలుక సంధానము చేయునది. ఇది ఆధ్యాత్మ మనఁబడును.

వీనిని మహా సంహితలందురు. వీనిని సరిగా తెలియు వాఁడు పుత్ర పశువులతోను అన్నముతోను బ్రహ్మవర్చస్సు తోను స్వర్గముతోను తులతూగుచుండును.

వేదములలో శ్రేష్ఠమై వేదము లను అమృత రూపము నుండి పుట్టిన యోంకారము ప్రజ్ఞతో నన్ను స్పృశించును గాక. నా శరీర సర్వ కార్యములను చేయు శక్తి గలిగినది అగును గాక! నా నాలుక మధువు గల వానిలో శ్రేష్ఠమైన దగును. చెవులతో ఎక్కువగా విందును గాక. మేధకప్పిన బ్రహ్మకోశ మవు నీవు నేను విన్న జ్ఞానమును రక్షింపుము.

నాకు అన్న పానములను గోవులను వస్త్రములు మొద లైన సంపదను ఇచ్చెదవు గాక! నీకు హవ్యము అర్పింతుము గాక.

మా యింటికి బ్రహ్మచారులు నియమ నిగ్రహములు గలవారై యెక్కువగా వచ్చెదరు గాక. ఓ భగవంతుఁడా

నిన్ను జేరుదును గాక! నీళ్ళు పల్లమును జేరునట్లు నన్ను బ్రహ్మచారులు చేరుదురు గాక ఓ ధాతా! నీవు మా ప్రక్క యింటివాడవు. భూః భువః సువః అనునవి మూఁడును వ్యాహృతులు అనఁగా విశేషముగా సర్వ లోకములను ఆహ్వానించునవి. మహః అను నాల్గవ వ్యాహృతిని మహాచమస్య ఋషి దర్శించెను. అదే బ్రహ్మము అదే ఆత్మ, దానికి సూర్య చంద్రాదులు లోకములు అంగములు. భూః అనఁగా ఈ లోకము భువః అంతరిక్షము. సువః అనఁగా స్వర్గ లోకము. మహః అనఁగా ఆదిత్యుఁడు. ఆదిత్యునిచే సర్వ లోకములు వర్ధిల్లుచున్నవి.

భూః=అగ్ని, భువః = వాయువు, సువః = ఆదిత్యుడు, మహః=చంద్రుఁడును అగును. చంద్రునిచే అన్ని హవిస్సులు గొప్పవగుచున్నవి.

భూః=ఋక్కులు, భువః = సామములు, సువః=యజుస్సులు మహః = బ్రహ్మయును ఓంకారము అగును. దీనిచే అన్ని వేదములు వర్ధిల్లుచున్నవి.

భూః=ప్రాణము, భువః=అపానము, సువః=వ్యానము, మహః=అన్నమును అగును. అన్నముచే అన్ని వర్ధిల్లుచున్నవి. వీనిని దెలియువాఁడు బ్రహ్మమును దెలియును. వీనిని సర్వ దేవతలు పూజింతురు.

ఈ హృదయాకాశ మందు మనోమయ పురుషుఁడు ఉన్నాడు. అతఁడు అమృతుఁడు హిరణ్మయుఁడు. తాలువుల మధ్య ఒక మాంసపు ముద్ద గలదు. అక్కడ సుషుమ్న నాడి

గండు. అదే దేవుని మార్గము. పాపిడిపై నున్న చోట నిది తల పుఱ్ఱెను జీల్చుకొని వెడలును. ఆ నాడి ద్వారా బ్రహ్మమును జూచినవాఁడు. భూః అని అగ్నియందు, భువః అని వాయువు నందు, సువః అని ఆదిత్యుని యందు, మహః అని బ్రహ్మ యందు ఉండి స్వారాజ్యమును మనస్సునకు బ్రభువైన బ్రహ్మమును పొందును. వాడు సర్వేంద్రియ పతియై విజ్ఞాన పతియై బ్రహ్మమై ఆనందమై అమృతమై యుండును. వానిని ఓ ప్రాచీన యోగ్యా! ఉపాసించుము.

భూమి అంతరిక్షము దివము దిక్కులు అవాంతర దిక్కులు ఇవి లోకపంచకము. దానిని అధిలోకమందురు. నిప్పు గాలి, సూర్యుఁడు, చంద్రుఁడు, నక్షత్రములు ఇట్టి దేవతా పంచకము. నీళ్ళు, ఓషధులు, వనస్పతులు, ఆకాశము, ఆత్మ ఇవి భూతపంచకము. దానిని అధిదైవతమందురు. వ్యానము, ప్రాణము, అపానము, ఉదాన సమానము ఇది వాయు పంచకము. కన్ను, చెవి, మనస్సు, వాక్కు, త్వక్కు ఇది ఇంద్రియ పంచకము. చర్మము మాంసము రక్తము ఎముకలు మజ్జ ఇవి ధాతుపంచకము. దానిని అధ్యాత్మమందురు. ఈ పంచక పంఖ్యలలో పంచపంఖ్యాత్మకమయిన విరాట్స్వరూపము యజ్ఞము (ఋక్కులు దేవులు ఋత్విక్కులు, యజమాని హవ్యము ఇవి యున్నవు,) పొంది సంతోషించును.

ఓం అన్నది బ్రహ్మము. ఓం అన్నదే అంతయు. ఓం అనుచు సామలు గానము చేయుదురు. ఓం అని అధ్వర్యువు ఋత్విక్కు పలికి బ్రహ్మమును పొందుదురు.

స్వధర్మము [ఋతము] వేద వ్రతములు, సత్యము,

దమము, శమము, అగ్నులు, అగ్నిహోత్రము, అతిథులు మనుజ కార్యములు ఋతుకాల భార్యా గమనము పౌత్రి దర్శనము ఇవియన్ని తప్పక మాచరింపఁదగినవి.

## వేదానువచనములు

ఉపనయనమ్ము చేసి వేద వేదాంగములు చెప్పి వటువునకు విద్య పూర్తియైన పిదప గృహస్థాశ్రమము స్వీకరించుటకు సెలవిచ్చుచు నిట్లు ఆచార్యుఁడు చెప్పెను.

సత్యము చెప్పుము, ధర్మమాచరింపుము, వేదాధ్యయనము చేయుటలో పొరపాటు పడకుము. ఆచార్యునికి ఇష్టమైన దానిని గురుదక్షిణగా నిమ్ము. వంశమును వృద్ధి పొందించు సంతాన మను తీవను తెంపకుము. సత్యము పలుకుటలో ధర్మము చేయుటలో పొరపాటు పడకు. క్షేమముగా నుండుటలో ఐశ్వర్యము విషయములో పొరపాటు పడకు. దేవ కార్యములగు యజ్ఞములు చేయుటలో పితృకార్యముల విషయములలో పొరపాటు పడకు. తల్లిదండ్రులను ఆచార్యులను అతిథులను దేవతలుగా జూడుము. మేము చేసిన మంచి పనులను చేయుము. ఇతరములు చేయకు, మనలో శ్రేష్ఠులైన బ్రాహ్మణులకు ఆసనమిచ్చి విశ్రాంతింపఁ జేయుము. శ్రద్ధతో వారికి దానము చేయుము. అశ్రద్ధతో ఇవ్వకు సంపద నిమ్ము. భయము సిగ్గుతో జ్ఞానముతో నిమ్ము. నీకు ధర్మము విషయములలో కర్మలను గూర్చి, నడతలను గూర్చి గాని నీకేదైన సందేహము గలిగినచో మనలో శ్రేష్ఠులను విమర్శకులను యుక్తులు మృదుతైనవారు ధర్మమందిచ్చగలవారు

నైనవారు ఎట్లు నడుతురో అట్లు నడువుము. ఇదే ఆజ్ఞ ఇది యుపదేశము. ఇది వేదరహస్యము. ఇదె వేదానుశాసనము. ఇట్లు ఉపాసింపుము.

## బ్రహ్మానందవల్లి

ఎవఁడు హృదయగుహ నున్న బ్రహ్మను తెలిసికొనునో వాఁడు సర్వకామములను పొంది బ్రహ్మమె యయిపోవును. అట్టి పరబ్రహ్మము నుండి ఆకాశము, దానినుండి వాయువు, దానినుండి అగ్ని, దానినుండి నీళ్ళు, దానినుండి భూమి, దాని నుండి సస్యములు; దానినుండి ఆహారము, దానినుండి జీవులు పుట్టును. జీవులు అన్నరసమయులు అన్నముచే పుట్టి జీవించి పెరుగుచుండును. తినునది తినఁబడినది అన్నము కాన అది అన్నమనబడును.

అన్నమునుండి జీవులు పుట్టును. అన్నముచే జీవించును, పెరుగును. చివర అందె లయించును. అందుచే అది సర్వౌషధ మనబడును. అన్నరసయమైన యాత్మ కంటె ప్రాణమయ మైన యాత్మ వేరు. అది పక్షివంటిది. దానికి ప్రాణము శిరస్సు దానికి దక్షిణభాగము అపానము, ఉత్తరభాగము ఆకాశము, ఆత్మ పృథివి తోక.

ప్రాణమును బట్టి మనుష్యులు పశువులు మొదలయినవి బ్రతుకును. అదే అన్నిటికి ఆయువు కనుక అది సర్వాయుష మనబడును. ఆ ప్రాణమయ జీవునికంటె మనోమయము వేరు. పక్షివంటి దానికి యజుస్సే, శిరస్సు, ఋక్కు, దక్షిణభాగము,

సామము, ఉత్తరభాగము, ఆదేశము, ఆత్మ, అథర్వాంగి రసము, తోక ఎందువల్ల నుండి యీ వాక్కులు మనస్సు దానిని పొందలేక వెనుకకు మరలుచున్నవో అట్టి బ్రహ్మము తెలిసిన బ్రాహ్మణుడు దేనివల్లను భయపడడు.

పక్షివంటి దానికి శ్రద్ధయె శిరస్సు, ఋతము (ఆచరణము) దక్షిణభాగము, సత్యము ఉత్తరభాగము, యోగము ఆత్మ. మహసు తోక అదే ఆధారము.

విజ్ఞానవంతుడు కర్మలను జేయును. దేవతలు విజ్ఞానమయమైన బ్రహ్మము ఉపాసింతురు. దానికంటె ఆనందమయ కోశము వేఱు, దానికి ప్రియము శిరస్సు. మోదము దక్షిణ భాగము, ప్రమోదము ఉత్తర భాగము. ఆనందము ఆత్మ. బ్రహ్మతోక అదే ఆధారము.

బ్రహ్మము లేదన్నవాడు అసత్పురుషుడు. బ్రహ్మము గలదని తెలిసికొన్నచో వాడు సత్పురుషుడగును.

ఆ పరమాత్మ నేను చాలమందిగా అగుదువనీ తలచెను. తలచి ఇదంతయు సృజించెను. దానిని సృజించి దానిలోనే ప్రవేశించెను. ప్రవేశించి సత్తుత్యత్తు స్పష్టముగ చెప్పదగినది, చెప్పరానిది ఆశ్రయము గలదానిని ఆ ఆశ్రయము లేనిదానిని చేతనమును, జడమును, సత్యము, అసత్యమును అంతయు సృజించెను.

మొదట ఇదంతయు అసత్తు (నామరూపాదులు లేనిది) గనే యుండెను. పిదప సత్తు నామరూపాదులు గలదయ్యెను. కనుక అది సుకృతమనబడును. అతడు రసమే. రసమును

పొంది ఆనందము గలవాడగును. నామ రూపాదులు లేని బ్రహ్మమే యీ నామరూపాదులు గల ప్రపంచముగనయ్యెను. ఇతఁడు ఆకాశరూప హృదయ గుహను ఉండకపోయినచో ఇంకెవఁడు ప్రాణాపానాదుల కర్మ చేయుచు ఆనందపెట్టును. ఇతనికి అపుడు భయమన్నది లేదు. బ్రహ్మను సరిగా తెలియనివానికి భయము గలుగును.

బ్రహ్మవలన భయపడియె గాలి వీచును. ఈ యాత్మ యొక్క భయముచేతనే సూర్యుఁడును, అగ్ని, ఇంద్రుఁడును మృత్యు దేవతయు తమ తమ పనులు చేయుదురు.

యువకుఁడు సాధు యువకుడై చదువుకొని చులుకై దార్ఢ్యము బలము గలిగి సమస్త భూమండలమున కధిపతియై ధనములతో నిండియుండుట అన్నది ఒక మనుష్యానందము అనఁబడెను.

అట్టి నూఱు ఆనందములు కలిసినచో ఒక మనుష్య గంధర్వుల (పుణ్యాదులు చేసి మనుష్యులు గంధర్వులుగానైన వారి) ఆనందమగును. అట్టి యానందము కోరికలచే జంప బడని శ్రోత్రియునికి ఉండును.

అట్టి దేవగంధర్వుల నూఱు ఆనందములు కలిసినచో ఒక పితృదేవతల యానందమగును. అట్టి యానందము కోరికలచేఁ జంపఁబడని శ్రోత్రియునికి ఉండును.

అట్టి పితృదేవతల నూఱు ఆనందములు కలిసినచో ఒక ఆజానజ దేవలోక దేవతలయానందమగును. అట్టి యానందము కోరికలచేఁ జంపబడని శ్రోత్రియునికి ఉండును.

అజానజ దేవతల నూఱు ఆనందములు కలిసినచో ఒక కర్మ దేవతల (వేదవిహిత కర్మలచే దేవులైనవారి) యానంద మగును. అట్టి యానందము కోరికలచేఁ జంపఁబడని శ్రోత్రియుని కుండును.

అట్టి కర్మదేవుల యానందములు నూఱు కలిసినచో ఒక్క దేవులయానందమగును. అట్టి యానందము కోరికలచే జంపఁబడని శ్రోత్రియుని కుండును. అట్టి దేవుల యానందములు నూఱు కలిసినచో ఒక ఇంద్రుని యానందమగును. అట్టి యానందము కోరికలచేఁ జంపఁబడని శ్రోత్రియుని కుండును.

అట్టి యింద్రుని ఆనందములు నూఱైనచో ఒక బృహస్పతి యానందమగును. అట్టి యానందము కోరికలచేఁ జంపఁబడని శ్రోత్రియుని కుండును.

అట్టి బృహస్పతి ఆనందములు నూఱైనచో ఒక ప్రజాపతి ఆనందమగును. అట్టి ఆనందములు కోరికలచేఁ జంపఁబడని శ్రోత్రియుని కుండును.

అట్టి ప్రజాపతి ఆనందములు నూఱైనచో ఒక బ్రహ్మ యొక్క ఆనందమగును. అట్టిది కోరికలచేఁ జంపఁబడని శ్రోత్రియుని కుండును.

పురుషుని యందును, సూర్యుని యందును గల బ్రహ్మము ఒక్కటే. ఇట్లు తెలిసినవాఁడు ఈ లోకము నుండి పోయి అన్నమయాత్మను పొందును. అందుండి మనోమయాత్మను, అందుండి విజ్ఞానమయాత్మను, అందుండి ఆనందమయాత్మను పొందును.

వాక్కులు మనస్సును ఆ బ్రహ్మమును పొందలేక వెనుకకు మరలును. ఇట్టి యానందమును దెలిసినవాఁడు దేని వల్లను భయపడఁడు. నేనెందుకు మంచి చేయకపోతిని. అయ్యో ఎందుకు పాపము చేసితిని అను దుఃఖము బ్రహ్మ వేత్తను బాధింపదు. బ్రహ్మవేత్త ఈ యన్ని దుఃఖములు దాటి యనంతమైన యానందము పొందును. వానినింకెన్నటికి దుఃఖము సోకదు.

వరుణుని కొడుకు భృగువు తండ్రియయిన వరుణుని జేరి ఓ భగవానుడా! నాకు బ్రహ్మను గూర్చి చెప్పుమనెను. అపుడతఁడిట్లు చెప్పెను.

అన్నము, ప్రాణము, కన్నులు, మనస్సు, వాక్కులు ఇవి బ్రహ్మమును తెలుపు ద్వారములు. దేని నుండి ఈ ప్రాణులు పుట్టుచున్నవో దేనియందు లీనమగుచున్నవో అదే బ్రహ్మము. దానిని దెలిసికొనుము అనెను. అపుడతఁడు తపస్సు చేసి అన్నము బ్రహ్మమని తెలిసికొనెను. అన్నము నుండి ప్రాణులు పుట్టి అందె లయించును అని తెలిసికొని తండ్రి దగ్గఱకు వచ్చి మరల ఓ భగవానుడా బ్రహ్మము నింకను తెలుపుమనెను. నీవింకను తపస్సు చేసి తెలిసికో అని తండ్రి యనెను. మరల అతఁడు వెళ్ళి తపస్సు చేసి ప్రాణము బ్రహ్మము అని తెలిసికొనెను. ప్రాణము నుండి ప్రాణులు పుట్టును, పుట్టి పెరిగి అందె లయించును. అని తెలిసికొని మరల తండ్రి దగ్గఱకు వచ్చెను. ఇంకను బ్రహ్మమును గూర్చి చెప్పుమని తండ్రి నడుగగా ఇంకను తపస్సు చేసి తెలిసికొనుమని తండ్రి యనెను. అతఁడు మరల తపస్సుచేసి మనస్సు

బ్రహ్మమని తెలిసికొనెను. మనస్సు నుండి ప్రాణులు పుట్టి పెరిగి లయించును. అని తెలిసికొని మరల తండ్రిని బ్రహ్మ మును తెలుపుమని యడిగెను. అతఁడింకను తపస్సు చేసి తెలిసికొనుమనెను. అతఁడు తపస్సు చేసి విజ్ఞానము బ్రహ్మ మని తెలిసికొనెను. విజ్ఞానమునుండి ప్రాణులు పుట్టను, పుట్టి పెరిగి అందె లయించును. కనుక అదే బ్రహ్మమని తెలిసికొని మరల తండ్రినడిగెను. ఇంకను తపస్సు చేసి తెలుసుకో అని అతఁడనెను. అతఁడు మరల తపస్సు చేసి ఆనందము బ్రహ్మ మని తెలిసికొనెను. ఆనందము నుండి ప్రాణులు పుట్టి పెరిగి అందె లయించును. అని తెలిసికొనెను. ఇదే భార్గవి విద్య అం దురు. ఇట్లు తెలిసికొన్న వాఁడు; అన్నము కలిగి అన్నము తినుచు గొప్పవాఁడయి సంతానముతో పశువులతో బ్రహ్మ వర్చస్సుతో మహాకీర్తి పొందును.

కనుక అన్నమును నిందింపరాదు. అన్నమును కొంచె మును విడిచిపెట్టరాదు. అది వ్రతము నీళ్ళను అన్నమే జ్యోతిస్సు అన్నమును తినునది, నీళ్ళలో జ్యోతి ఉన్నది. జ్యోతిస్సులో అన్నమున్నది. ఇట్లు అన్నము అన్నమందు ప్రతిష్ఠింపఁబడి యున్నదని తెలియువాడు అన్నము గలిగి అన్నము తినువాఁడై సంతానముతో బ్రహ్మవర్చస్సుతో గొప్ప కీర్తి కలవాడగును.

కనుక అన్నమును ఎక్కువగా ఉత్పత్తి చేయువలెను. భూమియు అన్నమె ఆకాశము అన్నము తినును. భూమి యందు ఆకాశమందు భూమియున్నది. ఇట్లు అన్నమందు అన్నమున్నది. ఇట్లు తెలియువాఁడు గొప్పకీర్తి వాడగును.

ఇంటికి వచ్చినవానికి (అతిథికి ఒకరోజు కంటె నుండని వానికి) నివాసమివ్వనని నివారింపరాదు అది వ్రతము. ఏలాగో ఒకలాగు (న్యాయముగా) ఎక్కువ అన్నము పొందవలెను. వచ్చినవానికి అన్నము సిద్ధముగా నున్నదనవలెను. అన్ని వయస్సులలో నున్నవారికి అన్నము సిద్ధము చేయవలెను. ఇట్లు చేయువాని కెపుడు అన్నము లోటురాదు.

వాక్కున క్షేమమై ప్రాణాపానములం గర్మమై చేతుల గతియై మలద్వారమున విసర్జనమై బ్రహ్మముండును. ఇవి మనుష్య సంజ్ఞలు.

బ్రహ్మము వృష్టియందు తృప్తియై విద్యుత్తున బలమై పశువుల యశస్సై నక్షత్రముల జ్యోతియై మర్మావయవమున సంతానమై అమృతమై ఆనందమై ఆకాశమున సర్వ వస్తు రూపమై ఉండును. ఇవి దైవ సంజ్ఞలు.

బ్రహ్మము మనస్సు అని ఉపాసించి మానవంతుడగును. బ్రహ్మము నమము అని యుపాసించినచో సర్వ కాలములు సిద్ధించును. బ్రహ్మమునే ఉపాసించినచో బ్రహ్మమే యగును.

జీవి లోకమునుండి పోయి అన్నమును, విజ్ఞానమును ఆనందమును పొందును. దానిని సామములతో హా వు హా వు హా వు హా వు అం గానము చేసి నిత్యమును అన్నమును తిండును. నేను విశ్వమును ఉపసంహరింతును. నా జ్యోతిస్సు సూర్యునివలె ప్రకాశించును అని తెలిసినవాడు ముక్తి పొందును. ఇది తత్త్వబోధకమైన యుపనిషత్తు.

ఇది భృగువల్లి.

ఇది తైత్తిరీయోపనిషత్తు

## 8 ఐతరేయోపనిషత్తు.

ఇది ఋగ్వేద బ్రాహ్మణారణ్యక కాండములలోని ద్వితీయారణ్యక మందున్నది. దీనిని ఐతరేయ ఋషి దర్శించెను.

నా మనస్సున వాక్కును, వాక్కున మనస్సును ప్రతిష్ఠితమై యున్నది. ఓ ఆత్మా నాకు ప్రకటమగుము. ఓ వాఙ్మనసులారా! నాకు వేదమును రప్పింపుడు. నేను విన్నది మఱవకుందును గాక. సత్యమును పలుకుదును గాక, అది నన్ను రక్షించును గాక; దానిని గురువును రక్షించును గాక.

మొదట ఆత్మయె యున్నది. అది లోకములను సృజింపఁ దలచి నీళ్ళను వానికాధారమైన లోకమును, కిరణములను దానికాధారమైన (ద్యులోకము క్రిందిది) అంతరిక్షరూపమును భూమిని మరఘు అను లోకమును సృజించెను. అట్లు సృజించి లోకపాలకుల సృజింతునని తలచి నీళ్ళనుండి పురుషుని (శరీరమను పురమున శయనించిన జీవిని) సృజించి ముఖమును, దానినుండి వాక్కును, వాక్కుయొక్క యధి దేవతయగు అగ్నిని, పిదప ముక్కును, దానినుండి ప్రాణమును, దాని యధి దేవతయగు వాయువును, పిదప కన్నులను, వాని యధిదేవతయగు సూర్యుని కర్ణములను, వాని యధి దేవతలగు దిక్కులు చర్మమును, దాని యధిదేవత వాయువును, దానినుండి రోమములను, అందుండి ఓషధులను, వనస్పతులను, మనస్సును అందుండి చంద్రుని నాభినుండి అపానమును; దానినుండి యధి దేవతయగు మృత్యువును, పిదప జననేంద్రియమును అందుండి శక్తిని అధిదేవతయగు జలమును సృజించి ప్రజాపతి జలరూపముగ నయ్యెను.

పిదప ఇంద్రియదేవులు) సంసార సముద్రములఁబడిరి. వాని కీశుఁడు ఆకలి దప్పికలను గూర్చెను. ఆ దేవతలు మాకాశ్రయమగు శరీరమును గూర్పుమనఁగా గోరూపమును అశ్వరూపమును గూర్పఁగా అది చాలదని దేవతలు అనిరి. పిదప మనుష్యరూపము చేయఁగా అది బాగున్నదనిరి. అందు వల్ల మనుష్యుఁడు సుకృతుఁ డనబడెను. అగ్ని వాక్కయి ముఖమును, వాయువు ప్రాణమై ముక్కును, సూర్యుఁడు కన్నయి కన్నులను, దిక్కులు శ్రోత్రమై చెవులను, ఓషధి వనస్పతులు రోమములై చర్మమును, చంద్రుఁడు మనస్సయి హృదయమును మృత్యుదేవత అపానమై నాభిని, నీరు రేత స్సయి జననేంద్రియమును పొందెను. ఆకలి దప్పులు మేమె క్కడ ఉందుమనఁగా అప్పుడు ఈశ్వరుఁడు ఈ యన్నిటి యందుండఁ డనెను. కనుక ఏ దేవతకిచ్చినను ఆ దేవతల భాగములే యవి యగును.

ఆ పరమాత్మ లోకములను లోకపాలురను సృజింతు ననుకొనెను అని సంకల్పింపఁగా మూర్తి (రూపము గలది) పుట్టెను. అదే అన్నమయిన యెలుకలు మొదలగునవి వానిని తినునట్టి పిల్లి మొదలగువానిని జూచి పరుగెత్తసాగెను. అన్న భక్షకులైన యన్నము పిల్లి మొదలగునవి ఎలుకలు మొద లగు నన్నములను వాక్కు చేపట్టుకొనఁ గోరెను. అపుడు వాక్కుచే పట్టుకొనలేకపోయెను. పిదప ముక్కుచేత కంటిచేత చెవులచేతను చర్మము చేతను మనస్సుచేత ఇట్లే అన్ని యింద్రి యముల చేతను పట్టుకొనగోరెను. అపుడు ముఖము లోనికి పోవు వాయువుచే పట్టుకొనఁగోరి పట్టుకొనెను. ఆ వాయువే అన్నమే జీవనముగాఁ గల వాయువు నేను లేకుండ ఏవి చేయ

గలవు. వాక్కు ముక్కు కన్నులు చెవును చర్మము అన్ని యింద్రియములే పని చేసినచో ఇంక నేనెందుకు నేను ఉంటినే ఇవి అవి అన్నియందమ పని చేయగలవు అని తలచి ఆ పర మాత్మ తల పాపిడి చీల్చుకొని ఆ దారిగుండ శరీరమునఁ బ్రవేశించెను. అది విధృతి యనెడి ద్వారము. ఇందు అతఁడు ఆనందించుటచే నందనము అనఁబడెను. దానికి స్వప్నముల వలె అనిత్యములైన తల్లి శరీరము తండ్రి శరీరము గర్భము అను స్థానములో నుండును.

దీనిని తెలిసినవాఁడు బ్రహ్మమగును. దీనిని చూచు చున్నాడు గాన (ఇదందర్శిత్యతి ఇది ఇంద్రః) ఇంద్రుఁడన బడెను. దేవతలుగా పిలవబడుట ప్రియము గాఁగలవారైరి.

ఈ గర్భము మొదట పురుషునియందు రేతో రూపముగా నుండును. అది స్త్రీయందు ప్రవేశించినపుడు ఆ గర్భము స్త్రీ శరీరములో నక్కయై యునది గతమును భావించును. మొదట కుమార రూపములో నున్న తన్ను పిదప వృద్ధి పొందించును. ఈ విధముగా ప్రపంచము అంతులేకుండ నుండును.

నేను తల్లి గర్భమున ఉండుచునే వాక్కు అగ్ని మొద లైన యింద్రియాది దేవతల జన్మలను తెలిసికొంటిని. ఇనుప కవచము వంటి దేహము లోపలే అనేక జన్మములను రక్షించు చున్నవి. వానిని డేగవలె జీల్చుకొని బయటపడితినని గర్భ ములో నుండగనే వామదేవుఁడు తెలిసికొని పుట్టి శరీరము పోయిన పిదప ఉత్తమగతిని పొందెను. ఇట్లు తెలిసికొని శరీ రములు ఇంక రాకుండఁజేసికొని జీవులు సుఖింపవలయును.

సరే దేనిని మనము ఉపాసించుచున్నామో ఆ ఆత్మ ఏది ఎట్టిది? దీని కుపాధియైనది శరీరమా ఉపాధిలేనిదేది? అని ప్రశ్నలు కలుగ శ్రుతి బోధించుచున్నది. దేనిచే వాసన చూతుమో వాక్కులు పలుకునో రుచిచూచునో మనస్సు మననము చేయునో ఈ జ్ఞానములు ధైర్యము మననము ప్రజ్ఞ ప్రాణశక్తి ఆశ కోరిక ఇవన్నియు ఆత్మయా?

అవి ఆత్మగాదు. ఏ చైతన్యము వీటినన్నిటిని చూచునో అదె ఆత్మ. ఇవన్నియు చైతన్యమునకు నామాంతరములు. అన్నియు చూచు చైతన్యమె బ్రహ్మము. ఇదే ఇంద్రుఁడు, ఇదే ప్రజాపతి, అగ్న్యాది దేవతలు ఇదే. భూతసంఘము గూడ ఇదే అన్నిటికి కారణమైనది ఇదే.

గుడ్డునుండి పుట్టు పక్షులు పాములు మొదలైనవియు మావినుండి పుట్టు పశువులును మనుష్యులు చెమటనుండి పుట్టు పేలు మొదలైనవియు నేలను పెల్లగించుకొని వచ్చు చెట్లు చేమలు మొదలగునవియు అన్నియు ఇదే. వామదేవుఁడు ఈ ప్రజ్ఞగలవాఁడై ఈ లోకము నుండి పోయి సర్వకామము లను పొందెను. అట్లే నీవును పొందఁగలవు.

ఇడి ఐతరేయోపనిషత్తు.

## 9 ఛాందోగ్యోపనిషత్తు

ప్రాణాది దేవతా విజ్ఞాన సహితమైన సమస్త కర్మలును అర్చిరాది మార్గమున బ్రహ్మమును పొందుటకుఁ గారణమైనవి. కేవల ధూమాది మార్గమున చంద్రుని పొందించును. ఈ రెండు మార్గముల నుండి భ్రష్టులైన వారు అధోగతిని పొందుదురని చెప్పబడెను. ఈ మార్గముల పోవువారికి పూర్ణ పురుషార్థము సిద్ధింపదు. అద్వైతజ్ఞానమె దానిని సిద్ధింపజేయును. అవిద్యాది దోషములున్నవారికేగాని అద్వైత భావన గలవారికి కర్మలు విధింపఁబడవు. ఈ యద్వైత విద్యా ప్రకరణములో అభ్యుదయ సాధనములగు ఉపాసనలు చెప్పబడుచున్నవి. ఈ యుపనిషత్తులో చెప్పఁబడిన యుపాసనలు సత్త్వశుద్ధిని గలిగించుట ద్వారా వస్తు తత్త్వమును ప్రకాశింపఁజేయును గాన అద్వైత జ్ఞానమునకు కారణములగును. ఆధార విషయము లగుట వలన ముఖ్యముగా ప్రాణాదులైన యుపాసనలు ముందు ఈ ఛాందోగ్యోపనిషత్తులో చెప్పఁబడుచున్నవి.

ఇది సామవేదములోనిది. ఛందస్సుతో గానము చేయునట్టి ఛందోగుల శాఖకు సంబంధించినదిగాన ఛాందోగ్యోపనిషత్తు అనఁబడెను. ఈ యుపనిషత్తు పెద్దది.

నా యంగములు నా యింద్రియములు సంతృప్తితో నుండుగాక. నేను బ్రహ్మమును నన్ను బ్రహ్మము నిరాకరింపకుందుము గాక. ఆత్మ నిరతుఁడనగు నాయందు ఉపనిషద్ధర్మములు కలుగుఁ గాక.

ఓం అనునది ఉద్గీదము. ఋత్విక్కు ఓం అని పైకి గానము చేయునుగాన ఉద్గీథమనఁబడును.

ఈ భూతములలో భూమి రసము (సారము). నీళ్లలో ఓషధులు రసము. ఓషధులలో పురుషుడు రసము. పురుషుని యింద్రియములు రసము, వాక్కులలో ఋక్కు రసము. ఋక్కునకు సామము రసము. సామకు ఉద్గీథము రసము. ఈ పరమాత్మ ఎనిమిదిట్లో ఓంకార రూపమైన యుద్గీథము. ఇది అన్నిటిలో గూడ అతిశయముగా రసము. ఓం అనునుద్గీథమే అన్నిటికి మూలము. ఓం యొక్క వ్యాఖ్యానమే సర్వ ప్రపంచమును.

ఆ యోంకారముతోనె విద్య అవిద్య రెండు చెప్పాదురు. విద్యతో శ్రమతో జేయునదే వీర్యవత్తరమగును.

దేవతలు అసురులు ఈ యిద్దరును ప్రజాపతి సంతానమే. వారిద్దరు పోరాడిరి. అప్పుడు దేవతలు ఓంకారముతో అసురులను ఎదుర్కొందుమని ఓంకారముతో జ్యోతిష్టోమాది హోమములను జేసిరి. అప్పుడు వారు ఘ్రాణమందు ప్రాణమును ఉద్గీథముగా ఉపాసించిరి. అట్లు ఉపాసింపంగా ఆ ఘ్రాణమందలి ప్రాణమును అసురులు పాపముతో స్పృశించిరి. అందుచేత ఆ ఘ్రాణము సువాసనను దుర్వాసనను గూడ గ్రహించును. ఇట్లే దేవతలు వాక్కును, కంటిని చెవులను మనస్సును ఉద్గీథముగా ఉపాసింపగా అసురులు వానిని పాపములో తాకిరి. కనుక అవి మంచివానిని చెడ్డవానిని గూడ పలుకును చూచును వినును తలచును. అప్పుడు దేవతలు ముఖమందలి ప్రాణమును ఉద్గీథముగా ఉపాసించిరి. అప్పుడు అసురులు దానికి తగిలిన మట్టిబెడ్డలవలె చితికిపోయిరి. ఇది సువాసన గలదానినే కాని దుర్వాసన గలదానిని గ్రహింపదు. కాని ఇది

ప్రహరింపబడిన పాపము గలదయ్యెను. కనుక ఇది ఏది తిన్నను ఏది త్రాగినను దానితో నితర ప్రాణములను ఇతరేంద్రియములను రక్షించును. తరువాత ఇది మరణకాలమందు ప్రాణ వృత్తియైన యన్నపానములను పొందిన ఘ్రాణాదుల పైకి పోవును. అందువల్లనే చివర నోటు తెఱచును.

ఆ ముఖమందలి ప్రాణమునె ఉద్గీథముగా అంగిరసమైన యంగిరసుడు తెల్పికొనెను. పిదప బృహస్పతి దాల్భ్యుడైన బకుడు దానిని తెలిసికొనెను. వీరు నైమిశక్షేత్రముననున్న వారికి గానము చేసిరి. ఇట్లు ఉద్గీథమును ఉపాసించువాడు కామములను పొందును. ఇది యధ్యాత్మ దృష్టితో జెప్పబడినది.

ఇట్లే ప్రాణాదిపంచకము. ఋగ్యజుస్సామాధర్వణములుగ పృథివ్యంతరిక్ష దినములను ఉపాసింపవలెను. ఇట్లు చేయువారు కోరికలను పొందుదురు. ఇది యధిదైవత దృష్టి.

ఎవరు ఏ దేవతలను ఉపాసింప గోరుదురో ఆ దేవత వైపుగా వెళ్ళవలయును.

దేవతలు మృత్యువు నుండి భయపడి త్రయీవిద్యను బొంది ఛందస్సులతో దానిని అచ్ఛాదింపజేసిరి. పిదప వారు అమృతులైరి. అందుచే అవి ఛందస్సు లనబడెను.

అంతరిక్షము, దివము, నక్షత్రములు అదిత్యునిలో శుక్లభాస ఋగ్రూపమైనవి. వాయువు ఆదిత్యుడు నీలవర్ణములు సామరూపములు.

సూర్యునిలో హిరణ్మయ పురుషుఁడు కనిపించుచున్నాఁడు. అతఁడు నఖశిఖపర్యంతము హిరణ్యరూపుడే. కపిపృష్ఠము వలె పుండరీకమువంటి రంగు గలవాఁడు. వాని కళ్ళు నట్టివే. అతఁడు అన్నిపాపముల నుండి దాటినవాఁడు. ఉద్గాత వీనిని గూర్చి గానము చేయును. వాఁడు అన్ని లోకములను ధరించెను. ఇది దైవతదృష్టి.

శిలకుఁడు చేకితాయనుఁడు ప్రవాహణుఁ డనువారు ముప్వురు ఉద్గీథములో వేర్పరుతై యుండిరి. వారందఱు ఉద్గీథమును గూర్చి చర్చ చేయఁదలచిరి. శిలకుఁడు చేకితాయనుని యనుజ్ఞ హొంది యిట్లు ప్రశ్నింపఁగా నతఁడు ఈ సమాధానములు చెప్పెను.

| | | | |
|---|---|---|---|
| ప్ర. | సామకు గతి యేది? | జవాబు | స్వరము |
| " | స్వరమునకు గతి యేది? | " | ప్రాణము |
| " | ప్రాణమునకు గతి యేది? | " | అన్నము |
| " | అన్నమునకు గతి యేది? | " | నీళ్ళు |
| " | నీళ్ళకు గతి యేది? | " | ఈ లోకము |
| " | ఈ లోకమునకాధారమేది? | " | స్వర్గము |

ఇంతవరకు చెప్పిన తరువాత ఇంక స్వర్గ లోకమునకు గతి యేది యని యడుగగా, ఇంక దానికి సమాధానము లేదు. అడిగితివా నీ తల పగులును. అనును. పిదప వారు ఓంకారమును గూర్చి మాటాడుకొందురు.

## ఉషస్తి కథ.

పిడుగులు పడుటచే కురుదేశములో క్షామమేర్పడెను. అప్పుడు చక్రుని కొడుకు ఉషస్తి యనువాఁడు తన భార్యయైన ఆటికితో మావటివాఁడు నివసించు గ్రామములో నివసించుచుండెను. ఈ యుషస్తి క్షామము వల్ల అక్కడ తిండిలేక యితర గ్రామమునకు పోవుచుండెను. దారిలో ఒక మావటివాఁడు కనిపించెను. అతఁడు మినుప గుగ్గిళ్ళు తినుచుండ చూచి అవి తనకుఁ గొంచెము పెట్టుమని యడిగెను. అపుడు మావటివాఁడు తినుచున్న పాత్రతో గాక వేఱొకడను గుగ్గిళ్ళు లేవనెను. "అయినా సరే ఆ పాత్రలోనివే పెట్టుము" అని యుషస్తి యనెను. అపుడు మావటివాఁడు తాను తినుచున్న పాత్రనుండి కొన్ని గుగ్గిళ్ళు ఉషస్తికిఁ బెట్టి యివిగో ఈ మంచినీళ్ళు కూడఁ దీసికొనుమనెను. అపుడు ఆ యుషస్తి ఆ గుగ్గిళ్ళు తీసికొని ఆ నీళ్ళు ఎంగిలివనెను. అపుడు మావటివాఁడు ఈ గుగ్గిళ్ళు మాత్రము ఎంగిలివి కావా అనఁగా నీళ్ళు ఎక్కడనైనను దొరుకును. ఇంక ఈ గుగ్గిళ్ళు తినకపోయినచో మేము చనిపోవుదుము అనెను. పిదప అతఁడు ఆ గుగ్గిళ్ళలోఁ గొన్ని తిని మిగిలినవి భార్యకిచ్చి దాచమనెను. అతని భార్య అదివరకే భిక్షమడిగి అది తిన్నది కాన ఆ గుగ్గిళ్ళు తాను తినక దాచెను. మఱునాఁడు ఉదయము భార్య దాచిన కొన్ని గుగ్గిళ్ళు తిని ఆ గ్రామములో రాజు చేయుచున్న యాగము చూడఁబోయెను. అక్కడ ఋత్విక్కులు యాగము చేయుచుండిరి. అక్కడకు పోయి ప్రస్తావమందు స్తోత్రము చేయుచున్న యుద్గాత దగ్గఱ కూర్చుండి స్తోత్రము చేయుచున్న స్తోతతో ఇట్లనెను. ఓ స్తోతా నీవు ఏ దేవతను గూర్చి స్తోత్రము చేయుచున్నావో ఆ దేవతను

తెలియక స్తోత్రము చేసితివా నీ తల పగులును జాగ్రత్త అనెను. ఇట్లే ఉద్గాతతోను ప్రతిహర్తతోను దేవతను గూర్చి తెలియక వారే కర్మలు చేసినను తల పగులును. అనఁగా వారు ఊరకుండిరి. అపుడు యజ్ఞము చేయుచున్న యజమానుఁడు ఉషస్తితో మీ సంగతి మాకుఁ తెలియదు. మీరెవరా ఋత్విక్కర్మలు చేయుఁడు. మీరే యీ యజ్ఞములో నాకు గురువు అనెను. "వీరికెంత ధనమిచ్చెదవో అంత ధనము నాకిచ్చినచో చేయుదుననీ యుషస్తి యనగా సరే ఇచ్చెదనని యజమానుడనెను. అపుడు ప్రస్తోత ఉషస్తితో దేవతను తెలియక స్తోత్రము చేసినచో తల పగులును అని యన్నావు గదా! ఆ దేవత యెవరు అనెను. అది ప్రాణదేవత ప్రాణు లన్నియు ప్రాణమునందే లీనమగు చున్నవి. ప్రాణము నుండియె వెడలుచున్నవి. ఈ దేవత ప్రస్తావింపబడినది. ఇది తెలియక చేసినచో నీ తల పగిలిపోయెడిదే. అని ఉషస్తి యనెను. పిదప ఉద్గాత అనెను. ఓ యుద్గాతా ఏ దేవత ఉద్గీధము ననుసరించి యున్నదో అది తెలియక చేసినచో నా తల పగులునంటివి. ఆ దేవత ఎవరు అనెను. ఆ దేవత సూర్యుఁడు. ప్రాణులు అన్నియు సూర్యుని గూర్చియె గానము చేయు చున్నవి. ఆ సూర్యదేవతయె ఉద్గీథము ననుసరించియున్నది. ఇది తెలియక చేసితివా నీ తల పగిలి యుండెడిది. అని యుషస్తి యనెను. పిదప ప్రతిహర్త యనెను. ఏ దేవత ప్రతిహారమును (అన్నమును పొందుట) అనుసరించెనో దానిని తెలియక చేసినచో తల పగులునన్నావు గదా ఆ దేవత యెవరు అని.

ఆ దేవత యన్నదేవత. ఈ ప్రాణులన్నియు అన్నమును

గూర్చియె పోవుచున్నవి. దానిమీదనే ఆధారపడి యున్నవి. ఇది తెలియక చేసినచో నీ తల పగిలి యుండెడిదనెను.

పిదప ఆ యజ్ఞమును ఉషస్తి చేయించెను. వారు ఉషస్తిని గౌరవించిరి. ఇంతేకథ.

ఓంకారమును గూర్చి పూర్తిగా అనేక విధములుగా ఇందు చెప్పఁబడినది. ఉకారము అకారము అథకారము హా ఉకారము మొదలగునవి సర్వ దేవతల రూపముగా ఇందు వర్ణించఁబడినది. సామోపాసనము సాధువయినది. సాముమిగా వచ్చెను. సామముగా పలికెను, అసామముగా (అసాధువుగా) పలికెను. ఇత్యాదుల సామశబ్దము సాధువు అన్న భావములో నున్నది. అసామోపాసన వలన సకల కామములు సిద్ధించునని చెప్పఁబడినది.

ఇట్లే లోకముల విషయములో సామమును హింకారము (ప్రారంభము) ప్రస్తావము (ప్రస్తుతించుట) ఉద్గీథము (గానముచేయుట) ప్రతిహారము (ముగింపు) నిధనము (చావు) ఇలా అయిదు విధములుగా సామాంగములుగా సామమును ఉపాసనము చేయవలెను. ఈ యయిదును పృథివ్యాది రూపములుగా వర్ణింపఁబడి యుపాసించవలయునని చెప్పఁబడెను.

ఇట్లే వృష్టి, నీళ్ళు, ఋతువులు, పశువులు, ప్రాణములు, సూర్యుడు, మృత్యువు, అగ్నిమథనము, మంత్రము, త్రయి విద్య, సామగానము, మొదలైనవానిలో అనేక రూపములుగా భావించి ఉపాసించవలెనని చెప్పఁబడినది. విస్తరభీతిచే నవి వివరింపఁబడలేదు. ధర్మ స్కంధములు మూఁడు గలవు.

యజ్ఞము వేదాధ్యయనము దానము అనునది మొదటి స్కంధము. తపస్సు రెండవ స్కంధము, బ్రహ్మచారియై ఆచార్య కులమున నెప్పుడు వసించుచు మిక్కిలి తన్ను ఆచార్యుని కులమున శుష్కింపఁ జేయుచుండుట అన్నది మూఁడవది. వీరందఱు పుణ్యలోకములను పొందుదురు. నాల్గవవాఁడైన సంన్యాసి బ్రహ్మమందుండి మోక్షము పొందును.

ప్రజాపతి లోకముల ధ్యానించెను. అందుండి వేదత్రయి నుండి భూః భువః అను నక్షరములు బయలుదేఱెను. ఆ మూడిటిని ధ్యానింపగా ఓంకారము బయలుదేరెను. అదే అన్నియు.

ఈ సూర్యుడే దేవతలకు తేనెపట్టువంటివాఁడు. దానికి దివము తేనెపట్టు పట్టిన యడ్డకఱ్ఱ. అంతరిక్షము దానికి తెట్టె. కిరణములు తేనెటీగల పిల్లలు. సూర్యుని కిరణములు తేనె జాళ్ళు, చుక్కలు తేనెటీగలు, ఋగ్వేదము పువ్వు నీళ్ళు అమృతము. ఆ ఋక్కు నీళ్ళు. తేనెటీగలే ఋక్కులు ఇట్లే యజుస్సు సామమును పువ్వులు. పురాణేతిహాసనములు బ్రహ్మము పువ్వులని యుపాసనములు.

అమృతమున అగ్నిముఖులైన వసువులు రుద్రులు ఆదిత్యులు మరుత్తులు సాధ్యులు జీవింతురు. దేవతలు తినరు త్రాగరు. చూచి తృప్తి పొందుదురు. ఈ విధముగా ఉపాసించువారు స్వారాజ్యము పొందుదురు.

గాయత్రియే ఇదంతయు. వాక్కు గాయత్రి. అది అన్నింటిని గానము చేయును. అట్లు గానము చేయువాని రక్షించును.

భూమియును మనుష్యుని శరీరమును గాయత్రియై అది నాలుగు పాదములు గలది. అదే వాక్కు భూతములు భూమి, శరీరము హృదయము ప్రాణము అని ఆరు విధములు గాయత్రి రూప బ్రహ్మ యొక్క మహిమ చాల గొప్పది. దాని పాదములు అవి భూతములు. దాని మూడవపాదము దినమున గలదు.

గాయత్రి రూప బ్రహ్మమునకు హృదయమున అయిదు గురు ద్వారపాలకులు గలరు. ప్రాణాదిపంచకము దాని ద్వారములు వీరే స్వర్గమునకు ద్వారపాలకులు. ఇది తెలిసిన వారు స్వర్గము పొందుదురు.

ఈ ప్రపంచమంతను తజ్జలాన్ అని యుపాసించ వల యును. తత్ దానినుండి జ-పుట్టినది, ల-లయించునది. అ-న్ ప్రాణము పొందునది. సంకల్పరూపుడైన జీవుడెట్టి కర్మచేసిన అట్టి ఫలమును పొందును. అందుచే సత్కృతువును జేయ వలెను.

ఆ సగుణ బ్రహ్మమును మనోమయము ప్రాణమయము కాంతి రూపము సత్యసంకల్పము సర్వకామము సర్వగంధము సర్వరసము. ఆ వాక్యము సంభ్రమము లేనిది. ఇదేనా హృదయములో నున్నదని శాండిల్యుఁడు. ఇట్లు ఉపాసన చేయవలయును.

ఆ బ్రహ్మము ఒక సంచివంటిది. అంతరిక్షమును మొదలైనవి కడుపు క్రిందిభాగము మొదలగునవి యగును.

పురుషుఁడు యజ్ఞము. మొదటి 24 ఏండ్లు ప్రాతస్సవనము గాయత్రి వసువులు ఉందురు. పిదప 24 ఏండ్లు మాధ్యం

దివస వనము త్రిష్టుభు రుద్రులుందురు. పిదవ 44 ఏండ్లు తృతీయ సవనము జగతి ఛందము ఆదిత్యులు ఉందురు. దీనిని ఉపాసించి మహిదాస మహర్షి 116 ఏండ్లు జీవించెను. యజ్ఞము చేయ గోరిక దీక్షలు ఆహార పానీయములు అల్పాహారములు హాసభోజనములు స్తోత్రములు తపో దాన ఋజువులు అహింస సత్యములు దక్షిణలు సోమరసపానాదులు అవభృథ స్నానము.

మనస్సును బ్రహ్మముగ ఉపాసించినప్పుడు దానికి వాక్కు ప్రాణము కన్నులు చెవులు అని పాదములు నాలుగు. ఆకాశమును బ్రహ్మముగ నుపాసించునపుడు అగ్ని వాయువు ఆదిత్యుఁడు దిక్కులు అనునవి పాదములు.

ఆదిత్యుని బ్రహ్మముగ ఉపాసించినపుడు జగత్తు నామ రూపాదులు లేని అసత్తుగా నున్నది. క్రమముగా నామ రూపాదులు సత్తుగా అయినది. అట్లయి గుడ్డుగా అయి పగిలెను. ఒక చిప్ప వెండివలె నుండి భూమి అయ్యెను. రెండవ చిప్ప బంగారముగా నుండి స్వర్గమైనది. గర్భస్థ స్థూల పదార్థములు పర్వతములయ్యెను. సూక్ష్మకోశము మేఘము మంచునయ్యెను. నదులు, నాడులు, మూత్రకోశము, జలము, సముద్రము అయినది.

ఈ విధముగా ఈ యుపనిషత్తులలో అనేకమైన యుపాసనలు చెప్పఁబడెను. సకల ప్రపంచమును బ్రహ్మముగాను యజ్ఞముగా ఉపాసించుచు భూమ్యాదులను వాని యంగములుగను యజ్ఞాంగములుగను దర్శింపవలెనని యీ యుపాసనల భావము.

## క థ

జానశ్రుతి యను రాజు కలఁడు. అతఁడనేక ధర్మ సత్రములను కట్టించెను. ఇట్లుండఁగా ఆతని సత్రములందు భుజించి సంతోషించిన మహర్షులు జానశ్రుతిని రక్షించుటకై రాత్రి హంసల రూపముతో వచ్చిరి. అందొక హంస ఇట్లనెను. ఓ భల్లాక్ష! స్వర్గముతో పగటితో సమానమైన ఈ జానశ్రుతి జ్యోతి అంతట వ్యాపించియున్నది. దానిని ముట్టుకోకు. అది తగులపెట్టుననెను. అపుడింకొక హంస యిట్లనెను. ఏమి నీవు ఈ అతనిని గూర్చి చెప్పుచున్నావు. బండి క్రింద నున్న రైక్వుని గూర్చి చెప్పినట్లు చెప్పుచున్నావే రైక్వుని జ్ఞానము లన్నియు స్వల్పములే సుమా అని.

ఈ మాటలు విని జానశ్రుతి ఆ రైక్వుని వెదకి తీసికొని రమ్మని తన సేవకుని పంపెను. అతఁడు వెదికి కనుగొనలేక వచ్చెను. అతనితో బండి క్రింద గజ్జి గోకికొను రైక్వుని చూచితినని రాజుతో జెప్పెను. రాజు ఆరువందలు గోవులను కంఠహారమును రెండు కంచరగాడిదలతోఁ గూడిన రథమును దీసికొనివెళ్ళి యిదిగో ఇవి తీసికొని నీవే దేవతను ఉపాసించు చున్నావో చెప్పుమని యడుగ నతఁడు ఓ శూద్ర! (శు=దుః ఖముచేద్రి పరుగెత్తువాఁడా!) ఇవన్నియు నీవే యుంచు కొమ్మనెను. అపుడు రాజు వెయ్యి ఆవులు కంఠమాలిక కంచరి గాడిదల రథమును భార్యగా తన కుమార్తెను ఒక గ్రామమును ఇచ్చెను. అపుడా రైక్వుడు వానిని గ్రహించి దేవతోపాసన మును జెప్పెను.

వాయువె అన్నిటిని గ్రహించు బాహ్య వస్తువు అగ్ని యుపశమించు నపుడు వాయురూపము పొందును. సూర్య చంద్రులును అస్తమించునపుడును వాయురూపమునె పొందుదురు. నీళ్ళు ఎండిపోయి నపుడు వాయువును పొందును. వాయువె అన్నిటిని గ్రహించును. ఇట్లు ఉపాసింపవలెను. ఇది ఆధిదైవతము.

ప్రాణమె అన్నిటిని గ్రహించువది మనుష్యుఁడు నిద్రించునపుడు వాని వాక్కు కన్నులు చెవులు మనస్సుల శక్తులు ప్రాణమునందె లీనమగును. దేవతలలోని వాయువు దర్శనాది ప్రాణ శక్తులలోని ప్రాణము బాహ్య స్వరూపము. ఇది అధ్యాత్మము అని చెప్పెను.

ఒకప్పుడు శౌనకుఁడు అభిప్రతారి అనువారిద్దఱు భోజనమునకుఁ గూర్చుండఁగా ఒక బ్రహ్మచారి వచ్చి భిక్ష యడుగఁగా వానిని పరీక్షించుటకై వారు వానికి భిక్ష పెట్టలేదు. అపుడా బ్రహ్మచారి ఇట్లనెను. దేవుఁడొకడు అతడన్నిటిని భక్షించుచు రక్షించుచున్నాఁడు. వానిని మనుష్యులు తెలిసికొనలేరు. ఈ యన్నము అంతయు అతనికే వేయఁబడుచున్నది. అన్నము అతనికే పెట్టబడుటలేదనెను. అపుడు శౌనకుడు వానితో నిట్లనెను. అతఁడు జంగమ స్థావరముల కాత్మ అగ్న్యాదులను సృజించినవాఁడు. బంగారు దంతములు గలవాఁడు సర్వభక్షకుఁడు మేధావి అతనిని ఎవరు తినలేరు. మేము అతనినే యుపాసించుచున్నామనగా అపుడు వారు బ్రహ్మచారికి భిక్ష పెట్టుమనఁగా భిక్ష పెట్టిరి. భుజించు వాయువు అన్నము అగ్ని సూర్యుఁడు చంద్రుఁడు జలము అనే మైధును ప్రాణము వాక్కు కన్ను

చెవి మనను అని యేదు. ఇవి మొత్తమయి పది. ఇవి గలది విరాట్టు అదే అన్న భక్షకము. దీనికి అన్ని తెలియును అని తెలియువాఁడు అన్న భక్షకుఁడగును.

## సత్యకాముని కథ.

జాబాలకొడుకు సత్యకాముఁడు గురుకులములో బ్రహ్మ చర్యము చరించుటకై పోవుచు నా గోత్రమేది అని తల్లిని జాబాలనడిగెను. తల్లి యిట్లనెను. నీ వే గోత్రమువాడవో నేనెఱుగను. బహు సేవ చేయుచు పరిచారకురాలనై యౌవనమున నిన్ను గంటిని. నా పేరు జాబాల. సత్యకామ జాబాలుఁడనని చెప్పుమనెను.

అతఁడు గౌతముని దగ్గఱకు వెళ్ళఁగా అతఁడు నీ వే గోత్రమువాఁడవని యడిగెను. అపుడు అతఁడు "నేను తల్లిని నే నే గోత్రమువాఁడను అని యడిగితిని" ఆమె నేను బహు సేవ చేయుచు పరిచారకురాలనై యౌవనమున నిన్నుఁ గంటిని నీవు జాబాల కొడుకువు సత్యకామజాబాలుడవు అని చెప్పెను.

అపుడు గౌతముఁడు ఇట్లనెను. బ్రాహ్మణుడు కానివాఁడు ఇట్లు పల్కలేడు. సౌమ్యా! సమిధలను దెమ్ము. దగ్గరకు నిన్ను తీసికొందును. (ఉపనయనము చేయుదును) నీవు సత్యము నుండి తప్పకొనలేదు." అని అతనిని తన దగ్గఱకు దీసుకొని చిక్కి బలముతేని నాలుగువందల గోవులను మందనుండి విడ దీసి సౌమ్యా వీని ననుసరింపుము అని వానిని పొగ్గనంపుచు ఇవి వేయి కాక ముందు మరలిరాకు అని గౌతముఁడనెను.

అపుడతఁడు ఆ గోవులు వేయి అగువరకు చాల యేండ్లు దూరముగా నుండెను. పిదప వాయుదేవతచే ఆవేశింపఁబడిన ఎద్దు సత్యకామునితో అనెను. ఓ సత్యకామా! మేము వేయి అయితిమి. మమ్ము గురుకులమునకు జేర్చుమని చెప్పి ఓయీ నీకు బ్రహ్మ యొక్క పాదము చెప్పెదను వినుము అనఁగా ఓ భగవానుడా! చెప్పుమనగా ఇట్లనెను. తూర్పు పడమర దక్షిణము ఉత్తరము ఇవి నాల్గు కళలు. ఇవి కలిసి ఒక పాదము దానిని ప్రకాశమందురు. నీకు అగ్ని యింకొక పాదము చెప్పుననెను. ఆ సత్యకాముఁడు ప్రొద్దుట గోవులను ఆచార్య కులమును జేర్చి అక్కడ అపి సమిధను తీసికొని తూర్పుగ కూర్చుండగా అగ్ని ఇట్లనెను. ఓ సౌమ్యా! నీను నీకు పాదము చెప్పెదను. పృథివి, అంతరిక్షము, దివము, సముద్రము, కళలు ఇవి కలిసి ఒక పాదము. హంస, సూర్యుఁడు నీకొక పాదము చెప్పుననెను. అతఁడు పొద్దుట గోవులను నడుపుచు అపి సాయంకాలము సమిధను పట్టుకొని అగ్ని యెదుటఁ గూర్చుండెను. అపుడా సూర్యుఁడిట్లనెను. అగ్ని సూర్యుఁడు చంద్రుఁడు మెఱుపు ఇవి కళలు. ఇవి కలిసి ఒక పాదము. నీకు ఇంకొక పాదము నీటికోడి (నీరుమలక్కి) ప్రాణము చెప్పునని. పిదప అది ప్రాణము కన్ను, చెవి, మనస్సు ఇవి కళలు. ఇవి కలిసి ఒక పాదము అయ్యెను. ఇట్లు నాలుగు పాదములు దెలిసి ఉపాసించువాఁడు లోకములను జయించుననెను.

పిదప సత్యకాముఁడు ఆచార్య కులమునకుఁ జేరఁగా గురువనెను. ఓ సత్యకామా! నీవు బ్రహ్మవేత్తవువలె నున్నావు.

నీకు ఎవరుపదేశించిరనెను. అనఁగా మనుషులకంటె ఇతరుల యుపదేశములచే నేమి తమరు ఉపదేశింపుఁడు అనెను. గురువు చెప్పినదే వీర్యవంతమగును. మీరే యుపదేశింపు డనఁగా ఆ దేవతలు చెప్పిన విద్యనే మరల గురువు చెప్పెను. దీనివల్ల నిందులో నేదియు తీసిపోదు.

ఇట్లుండగా ఒకప్పుడు ఉపకోసలుఁ డనువాఁడు సత్య కామ జాబాలుని దగ్గఱ బ్రహ్మచర్యము చేయు చుండెను. వాడు పన్నెండేండ్లు అగ్ని పరిచర్య చేసెను. గురువు ఇతర బ్రహ్మచారులకు వేదము జెప్పి వారినందఱను గృహస్థాశ్ర మమునకు పంపి వీడ్కొల్పుచు ఉపకోసలుని మాత్రము పంప లేదు. అప్పుడు అతని భార్య యిట్లనెను. ఈ బ్రహ్మచారి తపస్సు చేసెను. అగ్ని పరిచర్య చేసెను. ఈ యగ్ని భక్తుల లోపల వీడ్కోలు వీనికివ్వవు. నిన్ను అగ్నులు నిందింప కుండును గాక! కనుక నితనికి విద్యను జెప్పుము అనెను. అట్లు భార్య చెప్పినను అతఁడు విద్యను జెప్పకయే కొంతకాలము ప్రవాసము పోయెను. అపుడా ఉపకోసలుడు మనోవ్యాధిచే బెంగచే అన్నము సరిగా తినలేకపోయెను. అపుడామె ఎందుకు సరిగా తినుటలేదని యడుగఁగా మనుష్యునికి అనేకములైన కోరికలు ఉండును. అవి తీరకపోవుటచే తినలేకపోవుచున్నాను. అనఁగా అపుడాయగ్నులు కరుణించి ప్రాణము ఆకాశము బ్రహ్మమె యని చెప్పెను.

పృథివి అగ్ని అన్నము ఆదిత్యుఁడు ఈ నాలుగు నీ శరీరము. ఆదిత్యునిలోని పురుషుఁడనే నేను, అని గార్హపత్యాగ్ని చెప్పెను.

జలము, దిక్కులు, నక్షత్రములు, చంద్రుఁడు ఇది నా శరీరము. చంద్రునిలోని పురుషుఁడ నేనే అని దక్షిణాగ్ని చెప్పెను.

ప్రాణము, ఆకాశము, స్వర్గము, మెఱుపు ఈ నాలుగు నా శరీరము మెఱుపులో పురుషుడను. నేను అని ఆహవనీయాగ్ని అనెను.

అగ్ని విద్యయు ఆత్మ విద్యయు నీకు గురువు చెప్పునని యగ్నులు నిలబడగా అపుడు గురువు వచ్చి ఇట్లనెను. నీవు బ్రహ్మవేత్తవు వలె నున్నావే నీకెవరు ఉపదేశించిరి నని యడుగఁగా నగ్నులు ఉపదేశించె ననెను. అపుడు ఈ యగ్నులు కర్మములను గూర్చియె చెప్పినవి. తామరాకులోని జలమువలె అంటుకొననిదియు పాపము కర్మములేని బ్రహవిద్యను నీకుఁ జెప్పెదనని యిట్లనెను.

నేత్రములోఁ గనిపించు పురుషుఁడె బ్రహ్మము అదే అమృతము అభయము కండ్లలో నేయిపోసినను తాకురాకుపై జలమువలె అంటక జారిపోవును. అది నిర్లేపము నిరంజన మగు బ్రహ్మము. దీనిని సంయద్వామము అని వామనీ అని అందురు. దానిని తెలిసినవారు చనిపోయిన పిదప కర్మలు చేసినను చేయక పోయినను కాంతి పొంది పగటిదేవతను శుక్ల పక్ష దేవతను ఉత్తరాయణ దేవతను వర్షదేవతను ఆదిత్య దేవతను చంద్రదేవతను పొంది అమానవుడగును. ఇది దేవయాన మార్గము. దానిద్వారా బ్రహ్మమును పొంది పునర్జన్మ లేక శాశ్వతానందమును పొందునని చెప్పెను.

ప్రజాపతి కలను సృజించి అందులో నేది సారమని తలచెను. తలచి పృథ్వియందు అగ్ని రసమని అంతరిక్షమున వాయువు రసమని స్వర్గమున ఆదిత్యుఁడు రసమని తలచెను.

అగ్ని నుండి ఋక్కులు వాయువు నుండి యజుస్సులు ఆదిత్యునుండి సామలు రసములుగా నయ్యెను. మరల ఋక్కుల నుండి భూః యజుస్సునుండి భువః, సామనుండి సువః అన్నది వ్యక్తమయ్యెను.

## ప్రాణ కథ

ప్రాణము కనులు, చెవులు, మనస్సు ఇవి అన్నియు తమలో నేను గొప్ప నేను గొప్పదానినని పోరాడుకొని ప్రజాపతి దగ్గర మాలో ఏది గొప్పవని యడిగెను. ఏది లేకపోయినచో శరీరము నిరుపయోగమగునో అదే గొప్పదనఁగా వాక్కు వెడలిపోయి ఒక యేడు ఉండి మరల వచ్చి నేను లేనిచో ఎట్లుంటిరని అడుగ మూగవారువలె నుంటిమి. చెవులతో వింటిమి అన్నియు పనిచేసినవనెను. అపుడు చెవులు మొదలైనవి వెళ్ళిపోయినవి కాని ఏమియు బాధ కలుగలేదు. పిదప ప్రాణము లేచిపోవగా కొన్ని పోయినట్లయినవి. వానితోపాటు అన్ని పోవ మొదలుపెట్టెను. నపుడవి ప్రాణమె అన్నిటిలో గొప్పదని దానిని స్తుతింప మొదలుపెట్టెను.

## దేవయానము

శ్వేతకేతువు పాంచాల దేశమున ఒక సభకు వెళ్ళెను. అక్కడ ప్రవాహణుఁడను నతడు శ్వేతకేతువును జూచి నీకు మీ తండ్రి ఉపదేశించెనా అని యడిగెను. ఉపదేశించిరని

శ్వేతకేతువు అనఁగా అయితే ఈ యయిదు ప్రశ్నలకు సమాధానము చెప్పుము. 1 ప్రజలు ఈ లోకమునుండి యెచ్చటికి పోయెదరు? 2 వారెట్లు మరలి వచ్చెదరు? 3 జ్ఞానము కల కర్మపరులకు దేవయానము, కేవల కర్మపరులకు పితృయాణము ఈ మార్గములు గలవు గదా, ఈ మార్గము గుండా పోవువారెక్కడ విడిపోదురు? 4 ఈ పితృసంబంధ లోకమెందుకు పూర్ణమగుటలేదు, 5 ఐదవయాహుతి యందు నీళ్ళు ఎట్లు పురుషవాచ్యములుగా అగుచున్నవి?

అని ప్రశ్నింప శ్వేతకేతువు తెలియదని చెప్పి యింటికి పోయి వీనిని తన తండ్రియగు గౌతముని నడిగెను. గౌతముఁడు నాకును దెలియువని చెప్పి తాను రాజైన యా ప్రవాహణుని దగ్గరకు పోయి యడిగెను. అపుడు నీవు చాల దినములున్నచో చెప్పెదను. ఇదివఱలో ఈ విద్య బ్రాహ్మణులకు చెప్పలేదు. క్షత్రియులకు మాత్రమె పరంపరగా చెప్పఁబడెను. అది నీకు చెప్పెదను వినుము అని యిట్లు చెప్పెను.

1 ఈ పంచాగ్ని నెఱిఁగిన గృహస్థులు వానప్రస్థులు సంన్యాసులు నైష్ఠిక బ్రహ్మచారులు శ్రద్ధను తపస్సును ఉపాసించి చనిపోయిన పిదప అర్చిస్సు అర్చిస్సు దేవతను, అందుండి దినమును దినదేవతను అందుండి శుక్లపక్షమును ఉత్తరాయణమును సంవత్సరమును ఆదిత్యుని చంద్రుని పొందును. అక్కడకు ఒక అమానవ పురుషుడువచ్చి విద్యుత్తును శుక్లపక్షాది దేవతలను పొందించును. పిదప దేవతలను బ్రహ్మమును పొందెదరు ఇది దేవయానము. కేవల కర్మపరులును యజ్ఞము చేసి ధూమములు రాత్రిని కృష్ణపక్ష దేవతను దక్షిణాయనము

పితృలోకము ఆకాశము చంద్రుని పొందుదురు. వీరు దేవత
లను పొందుదురిది కారికన్నము. ఇది పితృయాణ మార్గము.
కర్మఫలము నశించువఱకు చంద్రలోకమునుండి మరల ఆకాశ
మును వాయువును పొగను మేఘమును వర్షమును వడ్లు
మొదలైన ధాన్యమును అన్నమును పొంది రేతోరూపముగా
స్త్రీలలో ప్రవేశించి జన్మించి మరలివచ్చెదరు.

3. ఈ దేవయాన పితృయాణ మార్గములందు ఒకే కాల
మున ప్రవేశించి తరువాత విడిపోయి జ్ఞానులు ఉత్తరాయణ
మార్గమునకు కర్మపరులు దక్షిణాయన మార్గమున పితృ
లోకమునకు పోయెదరు. పిదప పుణ్యాత్ములు బ్రాహ్మణ క్షత్రి
యాది జన్మలను పాపాత్ములు కుక్క పంది చండాలాది జన్మ
లను పొంది పుట్టుచు చచ్చుచుందురు.

పాపులు పితృలోకమును గూడ పొందరు కాన నిది
నిండిపోదు.

5 స్వర్గమే అగ్ని దానికి సూర్యుడు సమిధ. కిరణ
ములు పొగ. పగలు ప్రకాశము. చంద్రుడు మంట నక్షత్ర
ములు కణములు. ఆ యగ్నిలో దేవతలు హోమము చేయు
దురు. అందుండి చంద్రమండలమునకు పోదురు. 2 మేఘము
అగ్ని వాయువు సమిధ, మేఘము పొగ మెఱపు ప్రకాశము
ఉఱుము మంట శబ్దములు కణములు. ఈ దేవతలు సోమునికి
హోమము చేయుదురు. అందుండి వర్షమగును. 3 పృథ్వికి
యగ్ని సంవత్సరమునకు సమిధ ఆకాశము పొగ రాత్రి ప్రకా
శము దిక్కులు మంటలు దిశలును కణములు. ఈ యగ్నిలో
దేవతలు హోమము చేయుదురు. 4 పురుషుడు అగ్ని వాక్కు

సమిధ ప్రాణము పొగ నాలుక ప్రకాశము మంట చెవులు కణములు. ఈ యగ్నిలో అన్నమును దేవతలు హోమము చేయుదురు. దానినుండి రేతసు కలుగు. స్త్రీ అంగము సమిధ. ఆహ్వానము పొగ కలయిక మంట ఆనందము కణములు. ఈ యగ్నిలో దేవతలు రేతస్సును హోమము చేయుదురు. గర్భము కలుగును. ఈ యయిదు అగ్నులందు హోమము చేయబడు జలము (శక్తి) పురుషుఁడగును. కాన పురుష వాచ్యములగును. జీవి తొమ్మిది పది నెలలలో పుట్టును.

కథ

ప్రాచీన శాలుఁడు సత్యయజ్ఞుఁడు ఇంద్రద్యుమ్నుఁడు జనుఁడు బుడిలుఁడను వారు గృహస్థులు, మహాశ్రోత్రియులు. ఆత్మ మేది బ్రహ్మమేది యని చర్చించుచు వీరొకసారి యుద్దాలకుని దగ్గరకు వెళ్ళి యడిగిరి. అతఁడు నాకుఁ దెలియదు మన మందరము అశ్వపతి దగ్గరకు వెళ్ళుదము. అతఁడన్నియు చెప్పునని అతని దగ్గరకు వెళ్ళిరి. ఆ యశ్వపతి వీరికి చాల ధనమివ్వబోగా మీ ధనము వలదనిరి. అందుకు అతడు నా దగ్గఱ ఏ దోషము లేదే, నా దేశములో దొంగలు సురాపానము చేయు బ్రాహ్మణుఁడులేడు. యాగము చేయనివాడు అవిద్వాంసుడు వ్యభిచారులు లేరు గదా! ఎందుకు వద్దనుచున్నారు. మరల మీరెందులకు వచ్చితిరని యడుగ పురుష దే ప్రయోజనమునకై పరివర్తించుచున్నాఁడు చెప్పుమని యడిగిరి అందుకు నేను చెప్పెదనని మరువాడిట్లనియెను. ఔపమన్యువు దేనిని వైశ్వానరాత్మగా ఉపాసింతురనఁగా వాడు దినము వనెను. అనఁగా అవునది సురేతస్సుగలది వైశ్వానరుని నీవు

ఆత్మగా ఉపాసించుటచే యాగఫలము సఫలమైనది. అన్నము భుజింతువు. ప్రియము చూతువు. ఇట్లు ఉపాసించువాఁడు బ్రహ్మ వర్చస్వి యగును. ఇదే ఆత్మ శిరస్సు. నీవిట్లు వచ్చి తెలిసికొనకపోయినచో నీ తల పగిలి యుండెడిదే అని మిగిలిన వారిని కూడ నడిగెను. ఇంద్రద్యుమ్ను డపుడు వాయువును జనుఁడు ఆకశము అని బుడిలుడు జలమని ఉద్దాలకుడు పృధ్విని వైశ్వానరాత్మగా దలచుచు ఇట్లు చెప్పిరి. అందఱతో నాతడిట్లు అనెను. వేఱుగాను ఒకే వస్తువుగాను గనఁబడునది వైశ్వానరాత్మయె; ఇట్లు ఆత్మను ప్రాదేశమాత్రునిగను అభిమానునిగను తెలిసి యుపాసించువారు అన్నము భుజింతురు. ఈ యాత్మకు శిరస్సు సుతేజస్సు. నేత్రము విశ్వరూపము ప్రాణము పృధగ్వర్త్మాత్మ మధ్యదేహము బహుళము వస్తియె ధనము పాదములు పృధ్వి వక్షము యాగవేది, రోమములు దర్భలు హృదయము గార్హపత్యాగ్ని మనస్సు దక్షిణాగ్ని వాయువు అహవనీయాగ్ని అని చెప్పగా వారు సంతోషించి వెళ్ళినారు.

అన్నము భుజించునపుడు హోమము చేయవలయును. అది యజ్ఞము వంటిది. హోమము చేయునపుడు ప్రాణాయ స్వాహా అని జఠరాగ్నిలో హోమము చేసినచో ప్రాణము తృప్తి చెందును. ప్రాణము తృప్తినొందఁగా కన్ను సూర్యుడు దినము తృప్తి పొందును. అవి తృప్తి పొందగాను పశువులు ప్రజలు తృప్తి పొంది బ్రహ్మవర్చస్సును పొందుదురు. ఇట్లే వ్యానాయస్వాహా అని రెండవ యాహుతి యీయగా వ్యానుడు తృప్తి పొందగా చెవి చంద్రుఁడు దిక్కులు దిక్కులందున్నవి.

తాను తృప్తి పొందుదురు. పశువులు ప్రజలు తృప్తి పొంద పిదప తేజస్సు బ్రహ్మవర్చస్సును పొందుదురు.

ఇట్లే అపానాయ స్వాహా అని మూడవ యాహుతి యీయగా అపానము వాక్కు అగ్ని పృథ్వి, పృథివిలోని తాను తృప్తి పొంది వర్చస్సు పొందుదురు.

ఇట్లే నాలుగవ సమనాయ స్వాహా అని యాహుతి యీయగా సమాన వాయువు మనస్సు మేఘము మెఱపు తాను తృప్తిపొంది బ్రహ్మవర్చస్సును పొందుదురు.

ఇట్లే యైదవ ఆహుతి ఉదానాయ స్వాహా అని యీయగా త్వక్కు వాయువు ఆకాశము తాను తృప్తి పొంది బ్రహ్మవర్చస్సును పొందుదురు.

ఎవండిట్లు తెలియక అగ్నిహోత్రము హోమముచేయునో నిప్పులోగాక బూడిదలో హోమము చేసినవాఁడగును. తెలిసి చేసినచో స్వర్గలోకము అందు ఆత్మయందు ఆహుతి యిచ్చి నట్లగును. పొల్లు అగ్నిలో భస్మమైనట్లు జ్ఞానములో పాప ములు భస్మమైపోవును. తెలిసిచేసినచో అనర్హునికి దానమిచ్చి నను అది వైశ్వానరాత్మకిచ్చినట్లే యగును. ఇట్టివారు తల్లిని పిల్లలు చేరినట్లు అగ్నిహోత్రమును చేరి సుఖింతురు.

అరుణునికి శ్వేతకేతువను కొడుకు ఉండెను. ఒకసారి తండ్రి ఓ శ్వేతకేతూ! బ్రహ్మచర్య మాచరింపుము. మన కులములో విద్య నేర్వక బ్రహ్మబంధువైన వాడెవఁడును ఇది వఱలో లేఁడు. అనెను.

అప్పుడతఁడు వెళ్ళి 12 ఏండ్లు బ్రహ్మచర్యముండి ఇరవై నాలుగు ఏండ్లవాడయి వచ్చి అన్ని వేదములు చదివి మహా మనస్కుఁడై అనూచానుఁడనైతినని తలచి వినయము లేనివాడయ్యెను. అపుడు తండ్రియనెను. సరే నీవు అన్ని తెలిసిన వాడవు వలె నున్నావు. ఏది విన్నచో అన్ని విన్నట్లు అగునో ఏది తెలిసిన అన్ని తెలిసినట్లగునో, అది తెలిసికొంటివా అని యడిగెను. ఎట్లనఁగా ఎట్లు ఒక మట్టిముద్దను తెలిసికొన్నచో మట్టి దాని వికారములు తెలియును. ప్రమిదలు కుండలు మొదలైనవానిలో వాని ఆకారములు పేర్లు మాత్రము వేఱుకాని మట్టి మొదట ఒకటే. అట్లే లోహము ఒకటె. వాని వికారము ఆకారములు వాని పేర్లు వేఱు ఇనుము ఒకటే.

అట్లేయని ఆ శ్వేతకేతువు ఓ భగవానుడా! నాకు తెలిసినచో ఎందుకు తెలియనిదని యందును. కనుక భగవానులైన మీరె చెప్పుదురు గాక యని తండ్రినడుగ నతడిట్లు చెప్పెను.

సౌమ్యా! మొదట ఈ సత్పదార్థమె యుండెను అది యొకటె రెండవది లేదు అసత్తె మొదట నుండెను. ఆ యసత్తు నుండి సత్తు పుట్టెను. ఒకటె. రెండవది లేదు అని కొందఱందురు. సౌమ్య ఎట్లు ఇట్లు అగును. అసత్తునుండి సత్తు ఎట్లు పుట్టును. ఈ సత్తే మొదట నుండెను. ఒకటె. రెండవది లేదు. మట్టి మొదలగు సత్పదార్థముల వల్ల కుండ మొదలైనవి అగును ఏవియు లేనిదానివల్ల కుండలు మొదలగునవి యొటగును. అది చాల సృజించెదనని ఆలోచించి తేజస్సును సృజించెను. ఆ తేజస్సు ఆలోచించి నీళ్ళను సృజించెను. అందువల్ల ఎక్కడనైతే పురుషుడు శోకించునో అపుడు చెమ్మగిల్లును. కన్నీళ్ళు

వచ్చును గాన తేజస్సు నుండి నీళ్ళు పుట్టును. ఆ నీళ్ళు చాలగా మేము అయ్యెదమని ఆలోచించెను. అది భూమిని అన్నమును సృజించెను. ఎక్కడనైన వర్షించుచో అపుడు చాల అన్నమగును. నీళ్ళవల్లనే అన్నమగుచున్నది.

ఈ ప్రాణులన్నింటికి మూడే బీజములు అండజము, జీవజము, ఉద్భిజము అని. గ్రుడ్డులోనుండి పుట్టినవి పక్షులు మొదలగునవి. జీవము నుండి (మావినుండి) పుట్టునవి మనుజులు, పశువులు మొదలగునవి. భూమి నుండి పెల్లగించి పుట్టునవి చెట్లు మొదలగునవి. ఇక స్వేదజములు అండజోద్భిజ్జములలోనే యంతర్భవించును.

ఈ దేవత "నేను ఈ మూడు దేవతలను ఈ జీవముతో నన్ను వాటిలో ప్రవేశపెట్టినాను. రూపము లేర్పరతు" నను కొనెను. అగ్ని సూర్యుడు చంద్రుండు మెఱపులలో నున్న ఎఱ్ఱని రూపము తేజస్సుది. తెలుపు నీళ్ళది నల్లని రూపము అన్నముది (భూమిది) మనలో నెవరు తెలిసికొననిది తలపనిది అనుకొనుటకు సాధ్యముగాని వీనిని పూర్వము మహాశాలులు మహాశ్రోత్రియులు చెప్పి యుదాహరించిరి. తినబడిన అన్నములో గట్టిది మలమగును. మధ్యగానున్నది మాంసము అణువైనది మనస్సు త్రాగబడిన నీళ్ళలో గట్టిది మూత్రము మధ్యభాగము రక్తము అణువైనది ప్రాణమును, తినబడిన తేజస్సులోని గట్టిభాగము ఎముకలు, మధ్యభాగము మజ్జ అణువు వాక్కు అగుచున్నవి. అందు మనస్సు అన్నమయము. ప్రాణము అబ్మయము. వాక్కు తేజోమయము. తరచబడిన పెరుగు నుండి వెయ్యి వచ్చినట్లు తినంబడిన అన్నము సూక్ష్మ

సూక్ష్మమైనది మనస్సు అగుచున్నది. ఇట్లె త్రాగఁబడిన నీళ్ళనుండి తేజస్సు ప్రాణము వాక్కులు అగుచున్నవి అని యిట్లు చెప్పగ ఇంకను చెప్పుమనఁగా గురువిట్లనెను.

పురుషుఁడు పదునారు కళలతో (శక్తులతో) నుండును. నీవు పదునైదురోజులు తినక యుండుమనెను. నీళ్ళు పూర్తిగా త్రాగుము. ప్రాణము ఆపోమయము గాన ప్రాణము పోదన వాఁడు పదునైదురోజులు అన్నము తినలేదు. వానికి ఋక్కులు యజస్సులు సామలు స్ఫురింపలేదు. సరే అన్నము తినమనెను. తినెను అపుడు ఏది యడిగినను తెలిసికొని చెప్పెను. గురువిట్లనెను. సౌమ్య బాగుగా మండింపఁబడిన నిప్పులలో ఒక్క నలుపు మిగిలి అంతయు ఆరిపోయినందు వలన ఎక్కువగాఁ గాల్పలేదు. పదునారు కళల భాగములలో ఒక్క భాగము మిగిలి మిగిలినదంతయు పోవుటచే నీకు ఋక్కులు స్ఫురింపలేదు. ఒక భాగమే మిగిలిన నిప్పుకణము ఎండుగడ్డి వేయుటచే అది బాగుగా మండినట్లు ఒక యంశమె మిగిలిన యన్నమగు మనస్సున కొంచెమన్నము వేయుటచే అది పెరిగి అన్ని స్ఫురించెను. కాన అన్నమయము మనస్సు. ఆపోమయము ప్రాణము. తేజోమయము వాక్కు. అని శ్వేతకేతువునకు తండ్రి గౌతముఁడు చెప్పెను. మరియును ఉద్దాలకుఁడు తన కొడుకు శ్వేతకేతుని జూచి సుషుప్తిని గూర్చి వినుమని యిట్లు చెప్పెను. మనుజుఁడు నిదురించునపుడు తాను ఆసత్తుతోఁ జేరును. అందుచే వలుకఁడు వినఁడు నిదురించుచున్నాఁడందురు. దారముతోఁ గట్టబడిన పక్షి ఎక్కడికి పోయినను ఎప్పటి ప్రదేశము కట్టబడిన చోటికి వచ్చి చేరునట్లు మనస్సులో నున్న జీవుఁడు

ఎక్కడికి పోయినను జాగత్స్వప్నావస్థలందు కర్మలనుభవించుచు తనకు వేరే ఆధారము కనఁబడకపోవుటచే మరల ప్రాణమునే చేరును. మనస్సు ఆ ప్రాణముచేఁ గట్టఁబడియున్నది కదా.

సర్వమునకు సత్తే మూలము. సత్తునుండి బయలుదేరి సత్తునందు లయించును. చనిపోయినవాని వాక్కు మనస్సునందు మనస్సు ప్రాణమందు ప్రాణము తేజస్సునందు తేజస్సు పరమాత్మయందు లయించుచున్నది.

తేనెటీగలకు తాము తెచ్చిన తేనె ఏ పుష్పములదో తెలియనట్లును సముద్రమునుండి మేఘము ద్వారముగా గలిగిన నది నదములుగా సముద్రములో కలిసిన నీటికి తరువాత తా మే నదుల నీళ్ళో తెలియనట్లును సత్తుతోఁ గలిసిన తరువాత తా మెవ్వరో విడిగాఁ దెలియదన్నదా శిష్యుఁడు ఇంతవు వింతయింత మనెను. కాని పూర్వ వాసనను బట్టి అవి చేసిన కర్మలను బట్టి వ్యాఘ్రసింహవృక వరాహ కీట పతంగ దంశమశక మనుష్యాదులుగా తామెట్లు యుండిరో అట్లనే మరల అవుదురు. అనగా శ్వేతకేతువు మరల చెప్పుమనఁగా తండ్రి యిట్లనెను.

చెట్లను గొట్టివేయఁగా ఆ తెగిన కొమ్మలనుండి జీవము వెనుకకు మరలి పోవుచున్నది. కాన అది యెండుచున్నది. అట్లే శరీరము నుండి జీవుఁడు పోయినచో శరీరము పోవును గాని జీవుఁడు పోవడు. అది పోవునది గాదు, అది అణువు, అది జగత్తంతయు నిండియున్నది. అదే నీవై యున్నావు అనఁగా అంత సూక్ష్మమైన ఆత్మనుండి ఇంత ప్రపంచమెట్లు అయినది

అని శ్వేతకేతువడుగ ఇట్లు చెప్పెను. మఱ్ఱివండులోని గింజను చీల్చినచో అందేమి లేదు. మఱి అంత సూక్ష్మమైన గింజనుండి అంత పెద్ద మఱ్ఱిచెట్టు అయినట్లు ఈ సూక్ష్మమైన ఆత్మ నుండి ఈ సృష్టి బయలుదేరినదనెను. శ్వేతకేతువు ఇంకను చెప్ప మనఁగా గౌతముఁడిట్లనెను.

ఒక యుప్పుగడ్డను చెంబునీళ్ళలో తండ్రి కలవమన్నాడు. రాత్రి కలిపి మరల పొద్దున ఆ యుప్పును జూడమనఁగా లేద న్నాడు. సరే పై నీరు ఎలా ఉన్నదన్నాడు. ఉప్పుగా నున్నది. క్రింది పైన మధ్య అంత ఉప్పుగానే యున్నది. అలాగే యీ ఆత్మ ప్రపంచములో గలిసి దానిలో కలిసిపోయి నది కాన ఎక్కడ చూచినను ఆత్మరూపమే కనిపించుననె ఇంకను బోధింపుమన నతఁడిట్లనెను.

కండ్లకు గుడ్డకట్టి గాంధార దేశములకు పొమ్మనగా పోలేడు, గుడ్డ విప్పిన వెళ్ళగలఁడు. అట్లే ఆశచే శరీరములచే మాంసాదులచే భార్యా పుత్రాదులచే బద్ధుఁడైనవాఁడు ఏమీ చూడలేడు. ఆశాదుల నుండి విడినచో తన స్వరూపమును జూడగలడు. మరణావస్థలో నున్నవానిని బంధువులు చేరి నన్నెఱుగుదువా నేనెవరని అడుగుదురు. వాని వాక్కు మనస్సు నందు మనస్సు ప్రాణమునందును ప్రాణము తేజస్సునందును తేజస్సు పరమాత్మయందును లీనము కానంతవఱకు ఎఱుగుదు నెనును. వానిలో లయమైనచో చెప్పలేడు. అది లయము గన్నది ఆత్మయే. శ్వేతకేతూ! ఆయాత్మ నీవేయై యున్నావు.

ఎవడైన దొంగతనము చేసినపుడు ఒక గొడ్డలి కాల్చి దీనిని పట్టుకో దొంగతనము చేసితివా ఇది నిన్ను కాల్చును.

దొంగతనము చేయలేదా నిన్నుఁ గాల్చదు అందుచే. అప్పుడు దొంగతనము చేసియు చేయలేదని కాలిన గొడ్డలిని పట్టు కొన్నచో వానికిని కాల్చిన గొడ్డలికిని సత్యము అడ్డులేదు కాన వానిని కాల్చును. అట్లుగాక నిజము చెప్పినచో సత్యము వానికిని గొడ్డలికిని అడ్డుగా నుండును గాన కాల్పదు. ఇట్టి సద్బ్రహ్మకును సత్యాభిసంధేతరములకు శరీర పాతకాలమున సత్యప్రాప్తితుల్యముకాఁగా విద్వాంసుఁడు సత్తయి వ్యాఘ్రాది దేహములను పొందడు. నురల సత్యాభిసంధుడై మరల వ్యాఘ్రాది భావమును కర్మశ్రుతములను బట్టి బొందును అని శ్వేతకేతువు తెలిసికొనెను. దేహాదులందు ఆత్మ బుద్ధియున్నచో సదాత్మ విజ్ఞానము ఉండదు. తత్త్వమసి అను వాక్యము వికారానృతాధికృత జీవాత్మ విజ్ఞాన నివర్తకమె.

## నారదుని కథ

నారదుఁడు సనత్కుమారుని సమీపించి భగవానుఁడా! నాకు విద్య చెప్పుమనెను అప్పుడు సనత్కుమారుఁడు "నీకు ముందేమి తెలియునో చెప్పుము తరువాత నేను చెప్పెదను" అనెను. అప్పుడు నారదుఁడు భగవానుఁడా ఋగ్వేదము యజు ర్వేదము అథర్వాంగిరసమును పంచమ వేదమైన ఇతిహాస పురాణమును శ్రాద్ధకర్మ గణితము ఉత్పాతజ్ఞానము మహా కాలాది నిధిజ్ఞానము తర్కశాస్త్రము నీతిశాస్త్రము వేద వేదాం గములను భూతవిద్యను ధనుర్వేదము జ్యోతిషము సర్ప విద్యను గంధయుక్త నృత్యగీత వాద్య శిల్పాది విజ్ఞానము లను ఎఱుగుదును. నేను మంత్రవిదుఁడనే కాని యాత్మవేత్తను గాను మీవంటివాళ్ళు "ఆత్మవేత్త శోకమును దాటు" నని

చెప్పఁగా వింటిని నన్ను మీరు శోకముద్రమును దాటింపఁ డనెను.

అపుడు సనత్కుమారుఁడిట్లనెను. ఋగ్వేదాదులన్నియు నామ రూపములే నామమును బ్రహ్మగా నుపాసించువాఁడు నామమునకు తెలిసిన దాని విషయములో వాడు పూర్తిగా స్వేచ్ఛగా చరించును. అంతే అనఁగా నామముకంటె గొప్పవి గలవాయని నారదుఁడడుగ అతఁడిట్లనెను.

నామముకంటె వాక్కు గొప్పది. అదే ఋగ్వేదాదులను భూమిని దివమును పంచభూతములను దేవమనుష్య పక్షి తృణ కీటాదులను ధర్మాధర్మములను సత్యాసత్యములను సాధ్వసాధులను హృదయమున నున్న దానిని లేనిదానిని తెలుపును. అదే గనుక లేనిచో ధర్మాధర్మాదులను వేనిని తెలిసికొనలేఁడు. కనుక వాక్కును ఉపాసింపుమనెను. వాక్కును తెలిసికొన్న వాఁడు వాని విషయములలో స్వేచ్ఛగఁ జరించగలడనెను. అయితే భగవానుఁడా! వాక్కుకంటె గొప్పదున్నదా యనెను అతఁడిట్లనెను. వాక్కుకంటె మనస్సు గొప్పది. రెండు ఉసిరి కాయలనుగాని రెండు రేగిపండ్లనుగాని రెండు తాడికాయలను చేతిలో ఇముడ్చుకొన్నట్లు నామములు వాక్కును మనస్సు ఇముడ్చుకొనును. మనస్సుతో ఆలోచించి మంత్రములు చదువు అనిన మంత్రములు చదువును. తాను చేయునున్న పని చేయును. అట్లే మనస్సుతో పశు పుత్రాదులను సర్వ లోకములను పొందును. కనుక మనస్సే గొప్పది. దాని నుపాసింపుమనెను. అనగా మనస్సు కంటె గొప్పదున్నదా అని యనఁగా మనస్సు కంటె సంకల్పము. సంకల్పము కంటె

చిత్తము. చిత్తముకంటె విజ్ఞానము. విజ్ఞానముకంటె బలము గొప్పవి యనెను. బలమున్నచో అన్నియు జేయఁగలఁడు. అది లేనిచో ఏమయిన చేయలేడు. బలముకంటె అన్నము గొప్పది. అన్నము తిననిచో బలము ఉండదు. ఏమియు చేయలేడు. అన్నముకంటె నీళ్ళు గొప్పవి. నీళ్ళను త్రాగనిచో జీవులు బ్రతకవు. నీళ్ళకంటె వాయువు గొప్పది. వాయువే లేనిచో ఒక నిముషమును బ్రతుకఁడు. వాయువుకంటె తేజస్సు గొప్పది. తేజస్సుకంటె ఆకాశము గొప్పది. ఆకాశము లేనిచో అసలు మొదలే లేదు. సూర్యచంద్రులు మొదలవు వినలేఁడు తినలేడు. ఆకాశముకంటె స్మృతి గొప్పది. స్మృతి లేనిచో ఏమియు చేయదు. స్మృతి కంటె ఆశ గొప్పది. అసలు ఆశ యుంటేగా ఏదైనను చేయవలెనని కోరును. ఆశ కంటె ప్రాణము గొప్పది. ప్రాణము నుండి అన్ని బయలు దేరు చున్నవి. తల్లి తండ్రి దైవము అన్నియు ప్రాణమనెను. అంతతో నారదుఁడాగి సత్యమును గూర్చి చెప్పుమనెను. సత్యము తెలిసికొనుటకు విజ్ఞానము అవసరమని సనత్కుమారుఁ డనెను. సత్యమునకు మతి, మతికి శ్రద్ధ, శ్రద్ధకు నిష్ఠ, నిష్ఠకు కృతి—ఇంద్రియ సంయమము, చిత్తైకాగ్రత, ఇవియన్నియు సుఖము ఆనందము కొఱకు చేయును. ఆనందము భూమం (గొప్పది) బ్రహ్మము. అదే యన్నిచోట్ల-గలదు ఆ భూమయే (గొప్పది). ఆత్మయె ఆత్మ తెలిసికొన్నవానికి జరావ్యాధి మృత్యువులు లేవు. అదే ప్రపంచమయ్యెను కనుక పైవానిలో నాగాదులు అన్నిటికంటె ఆత్మయె గొప్పది. అందుచే దీని పొందవలయునన్న ఆహారశుద్ధి కావలెను. ఆహార శుద్ధియైన సత్యశుద్ధి ధ్రువమైన అది స్మృతి దానివల్ల సర్వపాశ ముక్తి

మోక్షము కల్గును అని నారదునికి సనత్కుమారుఁడు చెప్పెను. సనత్కుమారుని స్కందుఁడని కూడ అందురు. నారదునికింకను సనత్కుమారుఁడిట్లు చెప్పెను.

ఈ దేహమందు బ్రహ్మపురమనుస్థానము కలదు. దానిలో ప్రజలు ఇంద్రియములు, బ్రహ్మము రాజు. అందులో తామర పువ్వువంటి గృహము కలదు. అందు సూక్ష్మమైన యాకాశ మున్నది. దానిలో బ్రహ్మమును వెదకవలెను. ఆ హృదయాకాశములో సర్వ ప్రపంచములు భూమియు సూర్యచంద్రాదులు స్వర్గాదులు ఒకటేమిటి. అన్నియు అణిగియున్నవి. స్వచ్ఛమైన చిన్న అద్దములో చిన్న పాత్రలోని జలములో అన్ని కనిపించునట్లు హృదయాకాశములో అన్ని కనిపించును. సరే మరి ఈ శరీరము ముసలిదైనచో అపుడేది మిగులునని అడుగఁడడుగ ఈ శరీరము ముసలిదైనను ఆత్మకు బ్రహ్మమునకు ముసలితనము లేదు. దానికి మృతిమిశోకము ఆకలిదప్పులు లేవనెను. సరే ఈ ఆత్మను తెలియకపోయినచో ఏమి అనఁగా ప్రజలు రాజును తెలిసికొనక సర్వకామములు పొందలేక సర్వలోకములు తిరుగలేరు. సంకల్పసిద్ధుఁడు కాలేరు. ఆత్మను తెలిసికొన్నవాడు అన్నిచోట్లకు క్షణములో పోవును. సంకల్పమువల్లనే పితృలోకము మాతృభాతృ లోకములు గంధర్వలోకము గీతవాదిత్రలోకము స్త్రీలోకము సర్వలోకములను పొందగలఁడు.

ఈ సత్యకామములు తనలోనే లభించినను ఇవి అసత్యము లచేఁ గప్పఁబడి యున్నవి. బ్రహ్మజ్ఞానము గలవానిని ఈ అసత్యములు కప్పలేవు. అజ్ఞానిని చీకటివలె అసత్యము కప్పును. చీకటిని వెలుగు నశింపఁజేసినట్లు అసత్యమును

జ్ఞానము నశింపఁజేసి జ్ఞాని సత్యమును గానిపింపఁ జేయును. అట్టి సత్యమునకు ఆశ్రయమైన ఆత్మ హృదయమునఁ గలదు. సత్యమన్నది బ్రహ్మమునకు పేరు. సత్యము అనఁగా స= అమృతము తి=మర్త్యము, యమ్=వానిని కప్పునది ఏకము చేయును. ఇట్లు తెలిసినవాఁడు స్వర్గమునకు ప్రతి నిముషము పోవును.

ఆత్మయె సేతువు. అది అన్ని లోకములను ధరించునది. ఈ యాత్మకు జరామరణరోగాదులులేవు. ఎవడీ ఆత్మను బ్రహ్మ చర్యముచే పొందునో వాఁడు స్వతంత్రుఁడై కామచరుడై యుండును.

యజ్ఞము బ్రహ్మచర్యమె. బ్రహ్మచర్యముచేతనె అన్ని పొందుదురు. శాసత్త్రాయణము సతః త్రాయణము సత్రాయణము యజ్ఞము మౌనము యజ్ఞము అనాశాకాయనము ఉపవానము యజ్ఞము. ఆరణ్యాయనము యజ్ఞము. అరణ్య అను సముద్రములు రెండు గలవు. దానికిడ యర్థము. ఐరంమదీ మను సరస్సు, సామసవనమను అశ్వర్థము, అపరాజితమను నగరము గలదు. దానికి పరమాత్మ ప్రభువు.

హృదయమున నూటయొక్క నాడులు గలవు. అందులో సుషుమ్న మూర్ధముమ పొంది అమృతత్వమును పొందించు చున్నది.

వాయువు మేఘము మెఱపు శరీరములేనివై ఆకాశమున నడగి ఆత్మ ఆజ్ఞకు లోబడినవి. ఇవి ఆకాశము నుండి లేచి పరంజ్యోతిని పొంది మెఱపు ఉఱుము మేఘమునుపొంది చివరకును స్వరూపమున గలియుచున్నవి. ఇది చూచుటకు కన్నులు

వినుటకు చెవులు ఇంద్రియములను తలచుటకు మనస్సును ధరించును. బ్రహ్మమునకు ఆకాశమని పేరు. దానిలో నామ రూపాదులు అడగియున్నవి. అదె బ్రహ్మము అమృతము. ఇట్లు తెలిసినవారు బ్రహ్మమును పొందెదరు.

పిదప ఈ బ్రహ్మవిద్యను బ్రహ్మ పుత్రుడైన కశ్యప ప్రజాపతికి అతఁడు మనువునకు చెప్పెను. ఆచార్య కులమున వేదము చదివి గురుదక్షిణలిచ్చి కుటుంబమున శుచిప్రదేశమున వేదము చదువుచు ధర్మకార్యములు చేయుచు తన సర్వేంద్రియములు నిలిపివేసి హింసింపక శాస్త్రవిహితమైన భిక్షాటన చేయుచు హింస మానవలెను ఇట్లు నడచువాడు బ్రహ్మలోకమ్మును పొందును. తిరిగిరాఁడు. ప్రజాపతి దగ్గఱకు ఆత్మను దర్శింపవలయునని. అసురులును వారి రాజు విరోచనుఁడు దేవతలు వారి రాజు ఇంద్రుడును వచ్చిరి.

నేత్రములోని పురుషుఁడు బ్రహ్మమె అని ప్రజాపతి చెప్పెను. అది అమృతము అది అభయము. దానిని ఛాయా పురుషునిగ వారు తలచిరి. జలములోను ప్రతిబింబము కనిపించుచున్నది. ఆత్మ కంటిలోనిదా జలములోనిదా చెప్పుమనిరి. అన్నిటిలోను గనఁబడునది అంతయు ఆత్మయె అనెను.

మీరు జలము గల పాత్రలో ఆత్మను జూడుడు అనెను. వారు నఖశిఖపర్యంతముగల దేహమె ఆత్మ అనుకొనిరి. మరల క్షౌరము చేసికొని నగలు ధరించి చూడమనెను. అట్లు చూచి బాగున్నది అదే ఆత్మ అనుకొని పోవుచుండిరి. అపుడు ప్రజాపతి మీరు ఆత్మను జూడకయే పోవుచున్నారేమి అనెను.

దేహము ఆత్మగా అనుకొన్నచో అవమానము కలుగుననెను. అయినను విరోచనుఁడు శాంతుఁడై అసురుల దగ్గఱకు వెళ్ళి దేహమె ఆత్మయని దానినే పూజింపవలెనని చెప్పెను. అట్లు చెప్పుటచే అసురుల భావము విమర్శలేనిది శ్రద్ధయు దిక్కులు లేనిదయ్యెను. వారు శరీరానికి అలంకారాదులు పెట్టుకొని యాడుచున్నారు. ఇందువలన ఆ లోకము జయింపవచ్చు ననుకొన్నారు.

ఇంద్రుఁడు మాత్రము సందేహపడి దేవతల దగ్గరకు వెళ్ళక మరల ప్రజాపతి దగ్గరకు వచ్చెను. "అపుడు విరోచనునితోఁ గూడ వెళ్ళితివే మరల వచ్చితివే" అని పలికి ఛాయాత్మ జ్ఞానము ప్రయోజనకారి కాదు నీకుఁ జక్కగా ఉపదేశింతును. ఇంకను ముప్పైరెండు ఏండ్లు బ్రహ్మచర్యము చేయుము అనెను. అతఁడు అపుడట్లే చేసి వచ్చెను. అప్పుడు జాగ్రత్స్వప్న సుషుప్తులలో మహిమను పొందునది ఆత్మ అని వివరించి చెప్పెను. ఇట్లు చెప్పినది తెలిసికొనుటకు ఇంద్రునికి నూట ఎనిమిది ఏండ్లు పట్టెను. పిదప ప్రజాపతి యనెను.

ఈ శరీరము నశించు స్వభావము గలది. ఈ శరీరము శరీరములేని యాత్మకు నివాసస్థలము. శరీరమును బట్టి పాప పుణ్యములను ప్రియా ప్రియములను పొందుచున్నది. అశరీరియైన యాత్మకు ప్రియా ప్రియాదులు లేవు. ఇది చూచుట వినుట మొదలైన పనులకు కన్నులు చెవులు మొదలైనవి యింద్రియాదులను ధరించును. ఇది ఇంద్రియాదులను వదలి పరమజ్యోతి స్వరూపమును పొందును. అన్ని లోకములలో

అన్ని కోర్కెలను పొందును. అనగా ఇంద్రుడు సంతోషము పొంది వెడలిపోయెను. ఇది బ్రహ్మ మనువు మొదలైనవారికి చెప్పెను. ఇది తెలిసినవారును జన్మాదులను పొందక ఆనందింతురు.

ఇది
ఛాందోగ్యోపనిషత్తు

## బృహదారణ్యకోపనిషత్తు

ఇది శుక్ల యజుర్వేదములోనిది. ఇది పెద్దది కాన బృహత్ అరణ్య భాగములోనిది. అరణ్యకోపనిషత్తు అని పేరు కలిగినది.

1 ఇందు అశ్వమేధాశ్వము ప్రపంచముగాఁ జోల్చబడెను. ఉషఃకాలము శిరస్సు. సూర్యుఁడు కన్ను గాలి ప్రాణము వైశ్వానరాగ్ని నోరు. సంవత్సరము శరీరము. స్వర్గము పిఱుదు. ఆకాశము కడుపు. పృథ్విపాద పీఠము దిక్కులు ప్రక్కలు.

విదిక్కులు ప్రక్క యెముకలు. ఋతువులు అంగములు. మాసములు పక్షములు కణుపులు నభము మాంసము. ఇసుక జీర్ణము కాని యన్నము, నదులు నాడులు, పర్వతములు తిత్తులు చెట్లు రోమములు, మధ్యాహ్నపు కాలము పొట్ట, మధ్యాహ్నపు తరువాతి కాలము పొత్తి కడుపు, మెఱుపు నోరు తెఱచుట, ఉఱుము ఆవులింత. వర్షము మూత్రము. పగలు ముందున్న బంగారు గిన్నె. రాత్రి వెనుకనున్న వెండిగిన్నె. పడమట సముద్రము, ఈ గిన్నెలు అశ్వమునకు మహిమ

నిచ్చునవి. ఈ గుఱ్ఱము హయమను పేరుతో దేవతలను వాజి అని గంధర్వులను అర్వము అని అసురులను అశ్వము అని మనుజులను ఎత్తుచున్నది. దాని బంధువు సముద్రము దానికి కారణము పరమాత్మ. అశ్వము ప్రజాపతి.

2 అసురులును దేవతలును ప్రజాపతి సుతులే. అసురులను యజ్ఞములో ఉద్గీతము (ఓంకారము)చే జయింతుము" అని దేవతలు అనుకొని మా కొఱకు ఉద్గీథమును గానము చేయుము అని వాగ్దేవతతో అనిరి. వాక్కు అట్లే చేసెను. దాని వలన వచ్చిన స్థలము దేవతలకిచ్చెను. ఇది కలుసుకొని అసురులు ఆ వాగ్దేవతను పాపముతోఁ గొట్టిరి. (అపభ్యము అసత్యము మొదలగునవి మాటలాడిరి అని భావము).

ఇట్లే ఘ్రాణము శ్రోత్రము మనస్సులచే దేవతలు గానము చేయింపగా అసురులు వానిని పాపముతోఁ గొట్టిరి. దేవతలు అపుడు ప్రాణముచే ఉద్గీథగానము చేయించెఁ గాన అసురులు దానిని గూడ పాపములఁ గొట్టఁదలచి అట్లు చేయలేక చెల్లాచెదరయి నశించిరి. పిదప ప్రాణదేవత వాగాదులను అగ్న్యాది దేవతలను నట్లు చేసెను. వాక్కు మృత్యువును జయించి యగ్ని యయ్యెను. ఘ్రాణము వాయువుగా నేత్రము ఆదిత్యుఁడుగా శ్రోత్రము దిగ్దేవతగా, మనస్సు చంద్రుడుగా ఆయ్యెను. ప్రాణము అన్నమును ఆహారముగా పొంది అన్నింటికి వచ్చెను. ఈ ప్రాణమె బృహస్పతి సామవేదము. ఇది దోమ మొదలుకొని బ్రహ్మకొఱకు గల జీవులందున్నది. ఇది అంగములలో శ్రేష్ఠము రసము సారముగాన అంగిరసుఁడనఁబడెను.

3 ఆదిలో ఈ జగత్తు ఆత్మమయమై యుండెను. ఇది మొదట భయపడినదై నా కంటె నింక వేరేదియు లేదే. భయ మెందుకు అనుకొనెను. అంతలో భయము పోయెను. కాని దానికి తోచలేదు. సంతోషము కలుగలేదు. అపుడింక అది స్త్రీ కావలెననుకొనెను. కనుక ఒంటరిగా నున్నవాఁడు ఆనంద మొందలేడు. ఉత్తమస్థితి నుండి పడి (పతనాత్-పతిపత్ని) పతిగా పత్నిగా అయ్యెను. ఆత్మ తన్నే కలియుగోరుచున్నదని తలచి శతరూపయను పేరుపొందిన పత్ని గోవయ్యెను. అతడు వృషభమయ్యెను. అపుడవి కలియఁగా గోసంతతి కలిగెను. ఇట్లే గాడిద మేక మృగమ్ములు మొదలగు పశ్వాది సృష్టి అయ్యెను. ఆ ప్రజాపతి చేతులలో మొగమును లదిమెను. రూపాదులు లేని ఈ యాత్మ నామరూపాద్యులను పొంది వాగాది నామములను దాల్చెను. ఆత్మ ధనముకంటె సంతానముకంటె అన్నిటికంటె ప్రియమైనది. కాన దానిని తెలిసికొనవలయును.

4 ఈ బ్రహ్మమె (బ్రాహ్మణ జాతి) మొదట ఒకటిగా నుండెను. అది సర్వకర్మలను జేయఁగలది కాకపోయెను. అపుడు క్షత్రియుని సృజించెను. దేవతలలో ఇంద్రుఁడు వరుణుఁడు సోముఁడు రుద్రుఁడు మేఘుడు యముఁడు మృత్యువు ఈశానుఁడు లోనగువారు క్షత్రియులు. క్షత్రియుల కంటె శ్రేష్ఠులు లేరు. రాజసూయ యాగములో బ్రాహ్మణులు దిగువ నున్నారు. క్షత్రియులు పైనున్నారు. క్షత్రియుడు యశస్సు పొందును. దానికి బ్రాహ్మణుఁడు కారణము. తనకు కారణమైన బ్రాహ్మణుని నీచముగా జూచినవాఁడు నశించును.

పిదప క్షత్రియ జాతియును చాలదయ్యెను. అపుడు వైశ్యులను సృజించెను. వసువులు రుద్రులు ఆదిత్యులు విశ్వదేవులు మరుత్తులు వారు వైశ్యదేవులు.

ఇదియు చాలదయ్యెను. అపుడు శూద్రులను సృజించెను. పృథ్విని కూడ సృజించెను. ఇట్లు నాల్గు వర్గముల సృష్టి ఇపుడు సర్వ కర్మములను జేయు శక్తి గలదయ్యెను. ఆ బ్రహ్మము దేవతలలో అగ్ని రూపముగ బ్రాహ్మణుడయ్యెను. కామదేవతలలో అగ్నియందు వేల్చి తదనుగుణమైన లోకమును పొందును. ఎవడీతన సొంత ఆత్మను తెలియండో వానిని ఆత్మ రక్షింపదు. అతడు హోమముచేసి దేవలోకము, వేదములు చదివి ఋషిలోకము శ్రద్ధాదులచేతను సంతతిచేతను పితృలోకము దానాదులచే మనుష్య లోకమును పొందును.

5 తండ్రి చనిపోయిన పిదప తండ్రి చేయ మిగిలిన యజ్ఞము, వేదాధ్యయనము, దానధర్మాదికములు వాపికూప తటాకాదులను వాని కుమారుడు పూర్తి చేయవలయును. అట్లు చేయుటచే తండ్రి ప్రతిష్ఠను నిలిపినవాడగును.

6 గార్గ్యుడు అనునతడు కాశిరాజైన యజాతశత్రువుతో బ్రహ్మమును గూర్చి నీకు జెప్పెదను అని ఇట్లు చెప్పెను.

ఆదిత్యుడు చంద్రుడు విద్యుత్తు ఆకాశము వాయువు అగ్ని జలము అద్దము ప్రాణము దిక్కులు. ఛాయ బుద్ధి మొదలగు వానియందలి బ్రహ్మము నుపాసింపుమనగా అవి బ్రహ్మము కావని యా రాజనెను. గార్గ్యుడు నాకింతకంటె తెలియదు. నీవు చెప్పుమనెను. నేను రాజును నీవు బ్రాహ్మణుడ

పైనను నేను తెలిపెదను అని యిట్లు నిద్రించువాని దగ్గఱకు తీసికొనిపోయి ఓ సోమరాజా! అని పిలిచెను. వాడు పలుక లేదు. అపుడు చేతితో తట్టి లేపెను. అపుడతఁడు లేచెను. వాఁడు లేవకముందెక్కడున్నాఁడని యడుగఁగా నాకుఁ దెలియదనెను. ఈ విజ్ఞానరూప పురుషుఁడు నిద్రలో వాగాదితత్త్వ శక్తులను గ్రహించి తన స్థానమైన హృదయాకాశమున నిద్రించి యున్నాఁడు. అపుడు ప్రాణమును వాక్చక్షుశ్శ్రోత్రాదులను గ్రహించి చేష్టలు లేక యున్నపుఁడు సుపుఁడనుఁబడును. హృదయమున 72 వేల నాడులున్నవి. అవి శరీరమంత వ్యాపించినవి బుద్ధిలో విజ్ఞానమయ పురుషుఁడు ప్రతిఫలించి రాజు దేశమందువలె స్వేచ్ఛగా శరీరము సంచరించును. నిద్రించినపుడేమియు తెలియఁడు. అపుడు సుఖముగా నుండును. ఇదే నిద్ర. సాలెపురుగు తననుండి నూలు విడిచి మరల తనయందు లయింప జేసికొన్నట్లు తనయందు వాగాదులను లయింపఁచేసికొనును. బ్రహ్మము మూర్తము అమూర్తమునై యుండును. సగుణము నిర్గుణమునై యుండును కాని రెండు ఒకటే, వేఱు కావు.

7 యాజ్ఞవల్క్యుఁడు మైత్రేయిని పిలిచి ఓసీ! నేను ఇక్కడనుండి పరివ్రాజకాశ్రమము పొంద పోవుచున్నాను. రమ్ము ఈ కాత్యాయినితో తెగతెంపులు చేసి నీకు ధనము పంచి యిచ్చెదననెను.

అపుడు మైత్రేయి యిట్లనెను. అయితే ధనపూర్ణమైన యీ పృథివినంతను పుచ్చుకొన్నను నేను అమృతురాలను కాగలనా? అని.

కాలేవు అందఱు సంపన్నులవలె నీవుందువు అని యాజ్ఞవల్క్యుడనెను అయితే ఈ ధనముచే అమృతురాలను కాలేనపుడింక నాకు ధనముతో పనేమి నేను దేనిచే అమృతురాల నగుదునో ఆ యుపాయము తెలిసినచో నాకు చెప్పుము భగవానుఁడా అనెను.

అపుడా యాజ్ఞవల్క్యు డిట్లనెను. ఓసీ పతి యొక్క కామమునకు పతి ప్రియుడగును. తనయొక్క కామమునకు పతి ప్రియుఁడగును. ఓసీ భార్యకొఱకు కామమునకు భార్య ప్రియయగును. పుత్రులుగాని విత్తముగాని బ్రహ్మగాని క్షేత్రమును లోకములు దేవులు సర్వమును వారి కామముకొఱకు కాక ఆత్మ కామమునకే అవి యన్నియు ప్రియమగుచున్నవి. కనుక అట్టి ఆత్మయె కనఁదగినది. మననము చేయదగ్గది తలపదగ్గది ధ్యానింపదగ్గది. చూచుటచే వినుటచే మననముచే విజ్ఞానముచే ఇది యంతయు విదితమగును.

తనకంటె నేమియు లేదు. ఈ బ్రాహ్మణత్వాదులు లోకములు దేవతలు భూతములు అన్నియు ఆత్మయే. దుందుభి శంఖములు వీణ వీని శబ్దములగుచున్నప్పుడు ఇట్లే శబ్దములు గ్రహింపఁబడనట్లు ఆత్మయెదుట నింక నేమియు గ్రహింపఁబడదు. పచ్చికట్టె నిప్పునుండి వెడలు ధూమమువలె ఈ పరమాత్మ యొక్క నిశ్వసితమె ఈ ఋగ్వేదము యజుర్వేదము సామవేదము అధర్వాంగిరసము ఇతిహాసము పురాణము విద్యలు, ఉపనిషత్తులు, శ్లోకములు, సూత్రములు అనువ్యాఖ్యానములు వ్యాఖ్యానములు అన్నియు ఆ పరమాత్ముని నిశ్వాసములే. సమస్త జలములకు సముద్రము వలె స్పర్శ

గంధ రసరూపశబ్ద సంకల్ప విద్యాదులకు త్వక్ ఘ్రాణజిహ్వా చక్షుః శ్రోత్రమనో హృదయాదులు ఏకాయతనములు. ఉప్పు గడ్డ నీటిలో గలిసిపోవ ఆ నీళ్ళు ఎక్కడ చూచినను ఉప్పగ అయినట్లు ఈ భువనములలో గలిసిన యాత్మ విజ్ఞానమె. వానికి నామరూపాదులుండవు. అని యాజ్ఞవల్క్యుండనెను. నాకు భగవానుడు వ్యామోహము కలిగింపకుండును గాన తనకంటే వేఱుగ నున్నట్లు కనిపించును గాని తనకంటె వేఱేదియును లేదు. ద్వైతభావముచే వేఱుగా తోచుచున్నది కాని అంతయు ఒకటే.

ఈ భూమి జలాదులు సూర్యచంద్రులు మెఱపు ధర్మము సత్యము అన్నియు మధురమే.

మధువిద్య అధర్వణ దధీచిచే అశ్వినులు మొదలగు వారికి చెప్పబడెను.

విడేహరాజు జనకుండు విశేషదక్షిణలు గల యాగమొకటి చేసెను. ఆ యాగమునకు కురుపాంచాల దేశములనుండి పెద్ద బ్రాహ్మణులు వచ్చిరి. జనకుండుత్తముడైన బ్రాహ్మణునిం దెలిసికొనుటకు ఒక యుపాయము చేసెను. వేయి గోవులకు ఒక్కొక్కదాని కొమ్మునకు పదేసి బంగారు నాణెములు కట్టి ఒక గోశాలయందుంచెను.

అపుడా బ్రాహ్మణులతో నిట్లనియెను. "ఓ భగవానులారా! మీలో ఎవ్వరు బాగుగా బ్రహ్మమును దెలిసికొన్నారో వారి గోవులను దోలుకొని పొండు" అని. అపుడా బ్రాహ్మణుల కెవ్వరికి వానిని తోలుకొని పోవు ధైర్యము కలుగలేదు. అపుడు యాజ్ఞవల్క్యుడు తన శిష్యునితో ఓ సోమశ్రవా! ఈ గోవులను

తోలుకొని వెళ్ళు అనెను. అపుడా బ్రాహ్మణులకు చాల క్రోధము కలిగెను. అయితే నీవొక్కఁడవేనా మాలో బాగుగా బ్రహ్మము ను దెలిసినవాఁడవు. నీవొక్కడవేనా చెప్పుమనిరి. అందులో జనకునికి యాగము చేయించు హోత యశ్వయాలుఁడతనితో నిట్లనెను. ఓ యాజ్ఞవల్క్య నీవు బ్రహ్మిష్ఠుఁడవా అని. అపుడా యాజ్ఞవల్క్యుఁడనెను. మేము బ్రహ్మిష్ఠునికి నమస్కరింతుము. మేము గోవులను గోరువారము మాత్రమే అనెను. అపుడాతఁడు యాజ్ఞవల్క్యునితో నిట్లనెను.

అశ్వలుఁడు "ఓ యాజ్ఞవల్క్య! ఈ యాగ సామగ్రి యంతయు మృత్యువుచే వ్యాప్తమయి వశము చేసికొనఁబడెను గదా. యజమానుడా మృత్యువును ఎట్లు జయింతుము. అనగా అపుడతనితో యాజ్ఞవల్క్యుడనెను.

హోతయైన ఋత్విక్కుచేత అగ్నిచేత వాక్కుచే మృత్యువును జయింపవచ్చును. వాక్కె యజ్ఞమును జయించునది. ఈ వాక్కె అగ్ని అదే హోత. అదే ముక్తి ఇట్లు తెలిసినవాఁడు మృత్యువును జయింపవచ్చును అనెను. ఇట్లే ప్రశ్నింపగా యాజ్ఞవల్క్యుఁడిట్లనెను. యజమానుఁడు అహోరాత్రములచే వశీకరింపఁబడిన సర్వమును ఋత్విక్కు అయిన అధ్వరునిచేత కంటిరూపుఁడైన ఆదిత్యునిచేత జయించును. కన్నె ఆదిత్యుడు అతఁడే యధ్వర్యువు. శుక్ల కృష్ణపక్షములచే వశముచేసికొనఁబడిన యంతటిని ఋత్విక్కైన యుద్గాతచే వాయువుచే ప్రాణముచే జయించును. ప్రాణమె ఉద్గాత ప్రాణమె వాయువు ఆ వాయువె యుద్గాత. బ్రాహ్మణుడైన ఋత్విక్కు మనస్సనెడు చంద్రునిచేత స్వర్గమును జయించును. మనస్సె బ్రహ్మ అదే

చంద్రుండు ఆ బ్రహ్మ చంద్రుడు పురోనువాక్య యాజ్యశస్య అను మూండు ఋక్కులచేత ప్రాణజాతమునెల్ల జయించును. యజ్ఞమునందు అధ్వర్యువు హుతమైన యాహుతులను హోమము చేయును. వానిచే నీ లోకమును జయించుచు పితృ మానస లోకములను జయించును. బ్రహ్మయజ్ఞమును దక్షిణముగా మనస్సనెడి అనంత దేవతలచేత విశ్వదేవలోకమును జయించును. పురోనువాక్య శస్యలను మూడు స్తోత్రములచే ఉద్గాత స్తోత్రము చేయుంగా ఆధ్యాత్మమైన ప్రాణమె ఆ మూడు స్తోత్రములచే పృథివిని అంతరిక్షము ద్యులోకమును జయించును అని చెప్పంగా అశ్వలుండు ఇంక నూరకుండెను.

2 పిదప ఆర్తభాగుండిట్లు ప్రశ్నించెను. ఓ యాజ్ఞవల్క్య గ్రహములెన్ని అతిగ్రహములెన్ని అవి యేవి? అని యడుగగా యాజ్ఞవల్క్యుండనెను. ప్రాణము వాక్కు జిహ్వ నేత్రము చెవులు మనస్సు హస్తములు త్వక్కు ఇవి గ్రహములు. అపానము నామము రసము రూపము శబ్దము కామము కర్మ స్పర్శ ఇవి క్రమముగా పైవానికి అతిగ్రహములు. గ్రహములు అతిగ్రహములచే క్రమముగా గంధమును నామములను రసములను రూపములను శబ్దములను కామములను కర్మను స్పర్శలను గ్రహించును అనెను. మరల నతండిట్లనెను. మృత్యువనకన్నమె గదా దేనికేది యన్నము, అనగా జలము, ఆ జలమె అగ్ని మృత్యువులను జయించుననెను.

ఈ పురుషుడెందు చనిపోవుచున్నాండు వానిని ఏది విడిచి పెట్టదు అనగా పేరు విడువదనెను. ఆ పేరు విడువదనెను. ఆ పేరుచే విశ్వదేవులలోని ఆ దినమును జయించుననెను. మరల

ఆర్తభాగుఁడిట్లడిగెను. ఆజ్ఞాని చనిపోయినప్పుడు వాని వాక్కు అగ్నిని ప్రాణము వాయువును నేత్రము ఆదిత్యుని మనస్సు చంద్రుని చెవులు దిక్కులను, శరీరము భూమిని ఆత్మ హృదయమును రోమములు ఔషధులను వృక్షములను రేతో రక్తములు జలమును జేరును గదా అప్పుడీపురుషుఁ డెక్క డున్నాఁడు దేనినాశ్రయించియున్నాఁడు మరల ఈ శరీరము నెట్లు పొందుననగా అపుడు అతడనెను. కర్మను జీవుడాశ్రయించుకొని యున్నాడు. కర్మనుబట్టి శరీరము వచ్చును పుణ్యము చేసినచో పుణ్యవంతుడై పాపము చేసినచో పాపియై యుండుననెను. అపుడు ఆర్తభాగుఁడూరుకొనెను.

– పిదప భుజ్యుఁడడిగెను.

ఓ యాజ్ఞవల్క్య! మేము మద్రదేశము విద్యకోసము పోయి పతంజలుని గృహమునకు పోయితిమి. అతని కుమార్తె ఒక గంధర్వుని కామించెను. మేము వానిని జూచి నీవెవడవు అనగా నేను అంగిరసుఁడను, సుధన్వుఁడను అనఁగా లోకముల సమాప్తిని గూర్చి అశ్వమేధ యాగము చేసినవారెచట కేగుదురు అని యడిగితిని. అతఁడు సంతృప్తిగా జవాబిచ్చెను. నేనా ప్రశ్న నిన్నడుగుచున్నాను చెప్పుమనెను. అపుడతడిట్లు చెప్పెను. ఒకరోజులో సూర్యుని రథము ఎంతదూరము పోవునో దానికి ముప్పై రెండింతలు ఈ లోకము దానిపైన రెండింతలు వైశాల్యముగల భూమి ఆవరించియున్నది. దానికి రెండింతలు సముద్రము చుట్టుకొని యున్నది. అందకపాలములకు మధ్య కత్తియంచు ఈగ రెక్కవలె సూక్ష్మమైన ఆకాశము గలదు.

నందని వాయువు దేనియందు అనగా అంతరిక్షమందు అది గంధర్వలోకమందు అది ఆదిత్యలోకమందు అది చంద్రలోకమందు అది నక్షత్రలోకమందు అది దేవలోకమందు అది ప్రజాలోకమందు ఓతప్రోతమై యున్నదనెను. అది బ్రహ్మలోకమందనగా అది దేనియందు అనఁగా ఆ ప్రశ్న అడుగకు అడిగితివేని నీ తల బ్రద్దలగుననెను. అపుడు గార్గి శాంతించి మరల అడిగెను.

ఓ బ్రాహ్మణులారా! యాజ్ఞవల్క్యుని ఇంకొక రెండు ప్రశ్నలడుగుచున్నాను. అవి చెప్పినచో వానిని ఎవరు జయింపలేరనెను. ఓ యాజ్ఞవల్క్య! కాశిరాజుగాని విదేహరాజుగాని రెండు బాణములు వేయునట్లు, నేను నీపై రెండు ప్రశ్నలు వేయుచున్నాను చెప్పుము చూతము అని గార్గి యనెను గార్గి! అడుగు చూతమని యాజ్ఞవల్క్యుడనెను.

గార్గి: స్వర్గము దేనియందు ఓతప్రోతమై యున్నది. ఆకాశమందని యాజ్ఞవల్క్యుడనెను. ఆకాశము దేనియందు అక్షరమందు ఓతప్రోతమై యున్నదందురు. అది స్థూలమును అణువును హ్రస్వమును ఎరుపును చమురును ఛాయయు తమస్సును వాయువును ఆకాశము సంగమును రసమును గంధమును కన్నును చెవులు వాక్కు మనస్సు తేజస్సు ప్రాణము కానిది కొలత అంతరము బాహ్యము కానిది అది ఏదియు తినదు ఓ గార్గీ ఈ యక్షరుని శాసనమున సూర్యచంద్రులుందురు. భూమ్యాకాశములు కాలము ఋతువు దిక్కులు నదులు పర్వతములు దేవతలు మనుష్యులు దాని శాసనమున నుండి పని చేయుదురు. దానిని తెలిసినవాడు హోమము చేసినవాఁడు

అన్నిటిని జయించును. దానిని తెలియనివాఁడు దీనుఁడు అగును. ఈ యక్షర రూపమును వాఁడు చూడలేడు తెలియలేడు మననము చేయలేడు వినడు ఇది అన్ని చూచును తలచును వినును తెలియును అనఁగా గార్గి అనెను. ఓ బ్రాహ్మణులారా! ఇతని నెవరును గెలువలేరు. ఇతనికి నమస్కారము అని ముగించెను.

7 అపుడు నేర్పరి శాకల్యుఁడడిగెను.

వైశ్వదేవ యాగ మంత్రములందు చెప్పఁబడిన దేవులెంతమంది అని అడుగగా నిట్లు యాజ్ఞవల్క్యుఁడనెను.

దేవతలు 33, వారి విభూతులు 300 ను 3003 ను, 8 వసువులు 11 రుద్రులు 12 ఆదిత్యులు 1 ఇంద్రుఁడు 1 ప్రజాపతి మొత్తము 33 గురు.

అగ్ని, భూమి, వాయువు, అంతరిక్షము, ఆదిత్యుఁడు, స్వర్గము, చంద్రుఁడు, నక్షత్రములు వీరు వసువులు. కర్మ జ్ఞానేంద్రియములు 10 ఆత్మ మనస్సు అని మొత్తము 11 రుద్రులు. ఆదిత్యులు 12 నెలలఁదున్న సూర్యులు. ఇంద్రుడన మేఘము ప్రజాపతి. ఆర్గురు దేవతలు అగ్ని పృథివి వాయువు అంతరిక్షము ఆదిత్యుడు స్వర్గము 6 గురు దేవతలు అని చెప్పెను.

ఈ విధముగా చెప్పిన పిదప యాజ్ఞవల్క్యుఁని శాకల్యుడడిగెను.

శాకల్యుఁడా! ఎనిమిది ఆయతనములు ఎనిమిది లోకములు ఎనమండుగురు దేవతలు 8 గురు పురుషులు గల వీరిని

ఆత్మగా తెలిసి ఉపాధులను దాటిన ఎవడు ఉపనిషత్ప్రతిపాద్యుడో వానిని చెప్పుము. చెప్పవేని నీ తల పగులుననగా శాకల్యుడు చెప్పలేదు. కాన వాని తల పగిలెను, వాని శిష్యులు వానిని తీసికొనిపోయి సంస్కారము చేసిరి. యాజ్ఞవల్క్యుడనెను. ఓ బ్రాహ్మణులారా! లోకములో పురుషుడు వృక్షము వంటివాఁడు. దానికి రోమములు ఆకులు పట్ట చర్మ, చెట్టుపాలు రక్తము, తునకలు మాంసఖండములు, కట్టెలు ముకలు మాను నరికిన చిగురించును. మనుష్యుడు చిగుర్చడు. మరియు మనుష్యుడు చచ్చినవాడెట్లు మరల పుట్టును. వేళ్ళు విత్తు త్రవ్వినచో అది మరల మొలవదు, మనుష్యుడు నశించి తిరిగి ఎట్లు పుట్టును చెప్పుడనెను కాని చెప్పలేకపోయిరి. అపుడు శ్రుతి యిట్లన్నది విజ్ఞానమై ఆనందమైన యాత్మయె వీనిని మరల పుట్టించును అని.

8 జనకుఁడు యాజ్ఞవల్క్యునితో "నీకు గురువు చెప్పిన రహస్య విషయములు నాకు చెప్పుము" అనెను.

"ఉపనయనము (గురువు విద్యకై తన దగ్గరకు తీసికొనుట) వఱకు తల్లి పోషించి పిదప సమావర్తన పర్యంతము తండ్రి శాసించిన తర్వాత ఆచార్యుఁడు బోధించును అని శైలిని చెప్పగా మిగిలినది నేను జెప్పెదనని యాజ్ఞవల్క్యుడనెను.

వాక్కు శరీరము ఆకాశము ప్రతిష్ఠ దీనిని ప్రజ్ఞగా ఉపాసింపవలెను. వాక్కుచే నాలుగు వేదములు ఇతిహాస పురాణములు విద్యలు ఉపనిషత్తులు శ్లోకములు మంత్రములు సూత్రములు వ్యాఖ్యానములు ఇష్టము హుతము అశితము పాయితము జన్మ పునర్జన్మ సర్వ భూతములు తెలియఁబడు

చున్నవి. వాక్కునె ఉపాసించువానిని సకల భూతములు రక్షించును కాన వాక్కే బ్రహ్మము దీనిని దెలిసి ఉపాసింప మరణాంతరమున దేవుడగును.

9 మరణానంతరము నీవెక్కడికి పోదవో చెప్పెదను వినుమని జనకునికి యాజ్ఞవల్క్యుడిట్లు చెప్పెను.

ఈ నాడులు హృదయము నుండి పైకి పోవుచున్నవి. ఈ నాడులద్వారా అన్నము పైకి పోవుచున్నది. ఆత్మయు పోవుచున్నది, వైశ్వానరునికంటె ఈ తైజసుండు సూక్ష్మాన్న పచితుండు. సుషుప్తిలో వీడు ప్రాణమాత్రుండై నిశ్చేష్టితుండై యున్నాండు. అపుడు వీనిని ప్రాజ్ఞుండందురు. అన్ని దిక్కులను వీని ప్రాణములుండగా బ్రహ్మవేత్త సర్వాత్మయై ప్రాణాత్మకమైన ప్రజ్ఞాతత్త్వమునొంది కడపట తురీయావస్థ పొంది పరబ్రహ్మము నొందును. అపుడు చెదరడు దేనిలోను జేరడు కష్టపడడు నశింపండు అట్టియుభయాత్మను నీవు పొందెదవు అనెను.

10 ఒకసారి జనకుండు యాజ్ఞవల్క్యునిట్లడిగెను. ఈ పురుషుండు ఏ జ్యోతిస్సయియున్నాండు అని యడుగ నిట్లనెను అతడు ఆదిత్య జ్యోతిస్సయి జీవించును. అది లేనిచో చంద్రజ్యోతిస్సుతోను అది యస్తమించిన అగ్నితోను అగ్ని లేనియెడ వాక్కు జ్యోతిస్సుతోను అది యేమియు లేనిచో ఆత్మజ్యోతిస్సుతో నుండును అదే వీనిని బ్రతికించును. దానిచే సకల వ్యవహారములు చేయును. అందుచే నేను సుఖముగా నిద్రించితిని, అని యనును. నేత్రాదులకు స్వయముగా జూచుట వినుట మొదలైన శక్తులు లేవు. ఆత్మ జ్యోతిస్సుచేతనే చూచుచున్నవి. ఆత్మ ప్రాణములలో విజ్ఞానమయుండై హృదయమున అంతర్జ్యోతిస్సురూపుడై యుండును. కనుకనే స్వప్నములు ఇంద్రియాలు పనిచేయక పోయినను చూచుచుందుము.

అన్ని రథాశ్వాదులు సంకల్పించును. సంకల్పమాత్రము చేతనే అన్ని పనులు చేయగలఁడు. హిరణ్మయరూపుఁడై చైతన్యరూపుడై తన యిష్టము వచ్చినట్లు సంచరించును. తన మహాత్మతోఁ గలియును. పరంజ్యోతితోఁ గలియును. తెన్నెఱుగడు ఆ నిద్రపోయిన వానిని ఎవరును శీఘ్రము లేపఁ గూడదు. నిద్రపోయినపుడు శరీరమును ప్రాణము రక్షించును. ఆత్మ తన యిచ్ఛవచ్చిన చోటుల సంచరించును. అపుడింద్రియ వ్యాపారము లేదు త్వరగా లేపినచో ఆత్మ శరీరమును ప్రవేశించుటలో కష్టము కలిగి ఏ చెప్పుడో ఏదో రోగము సంభవించును.

11 మనుష్యుఁడు జరారోగాదులచే పండి చెట్టు నుండి పండ్లవలె శరీరము నుండి పడినవాడై పుణ్య పాపకర్మల కనుగుణమైన యింకొక శరీరమును పొందును. ప్రాణము శరీరమును విడిచి పోవునపుడు ఆదిత్య లోకప్రాప్తికి తగిన జ్ఞానము లేనిచో కండ్ల ద్వారా జీవుఁడు పోవును. బ్రహ్మలోక ప్రాప్తి యున్నచో కపాలమును చీల్చుకొని పోవును. అపుడు రాజు వెంట భటులవలె ప్రాణము మనస్సు ఇంద్రియములు అన్ని దానితో కూడిపోవును. తృణజలూక (గడ్డిమీద పాకు పురుగు) ఒక తృణము నుండి వేరొక తృణమును పట్టుకొన్న పిదప మొదటి తృణమును వదలును. అట్లు ఆత్మ ఈ శరీరమును విడిచి అవిద్యను నివృత్తి చేసికొని తన్నుఁ ముడ్చికొని వేరొక శరీరమును పొందుచున్నది, పాము కుబుసమును విడిచినట్లు ఈ శరీరమును విడిచిపోవును. బ్రతికియున్నపుడు తమో రజో గుణములు అంధతామిస్ర లోకములను పొంది మరల జన్మమెత్తును. ఆత్మనెఱిఁగిన సాత్త్వికుడు బ్రహ్మమొందును.

ఆత్మయందేకాగ్ర చిత్తముతో నుండువాఁడు తనయందే ఆత్మను దర్శించి సర్వమును ఆత్మగాఁ జూచును. ఇతనిని పుణ్య పాపములంటవు, జ్ఞానముచే వీఁడు తన కర్మలన్నిటిని భస్మము చేయును. ధర్మాధర్మములు లేక విరజుఁడై ఆశ లేక సంశయ రహితుఁడై బ్రహ్మము నెఱుఁగును. ఇదే బ్రహ్మ లోకము.

12 ఒకసారి ప్రజాపతి పుత్రులైన దేవతలు రాక్షసులు మనుజులు తండ్రి దగ్గర బ్రహ్మచర్యము చేసి మాకేవిషయ ముపదేశింతువని యడిగిరి. అపుడు వారికి ప్రజాపతి 'ద' అను నక్షరమునుపదేశించెను. వారు ఆ యక్షరమేదో తెలిసితిమని రాగా ఏమి తెలిసికొన్నారని ప్రజాపతి యడుగ అపుడు అతనితో మేము దమములేక యున్నాము గదా ఆ దమము (ఇంద్రియ నిగ్రహము)తో నుండమని చెప్పితిరి అని దేవతలు, మేము క్రూరముగా నుంటిమి గదా యని దయగా నుండుడని 'ద' అక్షరము నుపదేశించితిరని రాక్షసులు, మేము ఆశతో నుంటిమి గనుక 'ద' అనుదానిచే దానము చేయుఁడని యుపదేశించితి రని మనుష్యులును అనిరి.

ప్రజాపతి సరే మంచిది, అవునట్లే మీకు ఉపదేశించితి ననెను. కుటి మనుష్యులో దమమును దానమును దయ యును మూటిని అనుష్ఠింపవలయును.

13 భూమి అంతరిక్షము దివము ఆనునవి గాయత్రికి మొదటి పాదము. ఋక్కులు యజస్సులు సామము అని గాయత్రికి రెండవ పాదము. ప్రాణాపాన వ్యానములు మూడవ పాదము. ఈ తపించు పరోరజస్సు నాల్గవ పాదము.

ఇట్లు తెలిసినవాఁడు సంపదలతో యశస్సుతో ప్రసిద్ధి పొందును. ఈ గాయత్రి సత్యమందున్నది నేత్రమె సత్యము. సత్యము ప్రాణమందు బలమందు, ప్రాణము ఆత్మయందు నున్నది.

ద్యులోకాగ్ని పర్జన్యాగ్ని భూలోకాగ్ని పురుషాగ్ని స్త్రీయగ్ని అను ఈ పంచాగ్ని విద్యను తెలిసికొన్నవారును సతత బ్రహ్మోపాసకులు సన్యాసులును అర్చిరభిమాని దేవయాన అహర్దేవతను శుక్లపక్ష దేవతను ఉత్తరాయణ దేవతను దేవలోకము ఆదిత్య మండలము విద్యుద్దేవతలను పొందుదురు. అక్కడకు ఒక అమానవ పురుషుఁడు వచ్చి తీసికొని వెళ్ళగా బ్రహ్మలోకము చేరుదురు. వారికి పునర్జన్మ లేదు.

ఎవరు యజ్ఞదాన తపోవ్రతాదులచే లోకములను జయింతురో వారు గతించి ధూమదేవతను అందుండి రాత్రి దేవతను అందుండి కృష్ణపక్షదేవతను అందుండి దక్షిణాయనము అందుండి పితృలోకమును అందుండి చంద్రలోకము పొందెదరు. అక్కడ ఫలమనుభవించి మరల ఆకాశమును వాయు జలములను వర్షరూపమున ధాన్యమై అది తిన్న స్త్రీపురుషుల శక్తియై స్త్రీ గర్భమును వారు పొందుదురు.

13 జ్ఞానులును కర్మపరులును గాని వారు గతించిన మీదట క్రిమికీటాది జన్మలెత్తుదురు. జ్ఞానులైనవారు సకల కష్టములను దాటి బ్రహ్మము బొంది ఆనందింతురు.

ఇది
బృహదారణ్యకోపనిషత్తు.



— [] —

| శాంతినిలయ గ్రంథమాల | 8 | ఊనవింశతి పుష్పము |
|---|---|---|

# ఉపనిషత్తులకథలు

మన భారతదేశము భక్తులకు, యోగీశ్వరులకు, సాధకులకు, జ్ఞానులకు పుట్టినిల్లు. పూర్వకాలమున బ్రహ్మజ్ఞానులు తపోవనములలో వసించుచు బాలబాలికలకు ఉత్తమజ్ఞానమును బోధించెడివారు. బాలబాలికలను తమ బిడ్డలుగా భావించి సహనశక్తితో, శాంతభావముతో, గంభీర విషయములను, మహత్తర విషయములను, సులభముగా గ్రహింపచేయుటకు కథలద్వారా దృష్టాంతములద్వారా బోధించువారు. బాలబాలికల మనోవికాసమును, ధర్మబుద్ధిని, వివేచనా శక్తిని, అభివృద్ధిచేయు విషయములను బోధించి వారి హృదయములను పవిత్రముచేసి భక్తిపరాయణులనుగ గావించువారు.

## శాంతినిలయ గ్రంథమాల

ప్రొప్రైటర్:— అకురాతి చలమయ్య, కాకినాడ.
సర్వస్వామ్యములు వెల
ప్రకాశకునిది రూ. 1-0-0

# విషయసూచిక





# ఉపనిషత్తుల కథలు

## బాలజ్ఞాని నచికేత

—(౧)—

సంస్కృత భాషలో "ఉపనిషత్తు" లను గ్రంథములు గలవు. ప్రాచీన ఆర్య ఋషీశ్వరులు ఈ గ్రంథములను వ్రాసి యుంచిరి. మన ప్రాచీన ఋషీశ్వరులు ఎట్టి ఆలోచనములను చేయువారో, ఎట్టి సాధనము గావించువారో, వారి జీవితములు ఎంత మహోత్తరమైనవో, ఈ గ్రంథములలో కానవగును. కొందరి అద్భుత బాలుర చరిత్రలు ఈ గ్రంథములలో వర్ణింపబడి యున్నవి.

ప్రథమమున నచికేతుని విషయము ఆలోచింతము.

వాజశ్రవస ఋషీశ్వరుని తపో వనములో ఒకనాడు భారతదేశ ఋషిముని సంఘము లందరును సమావేశమై ఉండిరి. ఆ ఋషీశ్వరుడు విశ్వజిత్ యజ్ఞమును ఆచరించుచుండెను. ఈ యజ్ఞమును ఆచరించువారు తనకు ఉన్నదంతయు దానము చేయవలసి యుండును, తనదని దేనిని కూడ ఉంచుకొనుటకు వీలులేదు.

యజ్ఞము పూర్తి అయినది వాజశ్రవస ఋషి తన యావదాస్తిని ఒక్కొకటే అందరికిని దానము చేసెను. బాల

నచికేతుడు ఆ యజ్ఞసభయందు ఒక ప్రక్కన నిలువబడి అంతయు పరికించు చుండెను. నచికేతుడు వాజశ్రవస ఋషికి ఏకైక పుత్రుడు.

దాన ధర్మములు సమాప్తము గావింపబడెను. ఈ సారి పురోహితులకు దక్షిణలు సమర్పించుకొను సమయము వచ్చినది, కాని దక్షిణలు ఇచ్చుటకు అప్పటికి కొన్ని బక్క చిక్కిన ఆవులు మాత్రమే మిగిలి ఉండెను. ఆ ఋషీశ్వరుడు వానినే పురోహితులకు దక్షిణగా సమర్పించు కొనెను.

నచికేతుని మనస్సు విచారముగా ఉండెను. బక్క చిక్కిన ఎండిపోయిన ఆవులు విశ్వజిత్ యజ్ఞమునకు దక్షిణలా అని తలంచెను.

వాజశ్రవస ఋషి అభ్యాగతులను ఒక్కొకరినే పంపి వేయు చుండిరి, నచికేతుడు తండ్రివద్దకు పోయి "మహర్షి తమరు నన్ను ఎవరికి దానము చేసితిరి" అని ప్రశ్నించెను.

పుత్రుని ప్రశ్న తండ్రి విని విననట్లుగా ఉండెను.

నచికేతుని మనస్సు కలవర పడుచుండెను. ఋషి సర్వస్వమును దానము చేసి తన స్నేహ ధనమును దాచి ఉంచుకొనెను, విశ్వజిత్ యజ్ఞ ఫలమును ఆయన పొంద గలరా!

పితా, మీ శ్రేష్ఠ సంపదను నేను, నన్ను ఎవరికి దానము చేసితిరి. అని మరల ప్రశ్నించెను.

ఋషి మనస్సులో ఆ ఆలోచనము లేకుండెను. అందు వలన ఆయన జవాబు చెప్పక మిన్నకుండెను. బాహ్యక మైన సర్వస్వమును దానము చేసినను ఋషీశ్వరుని మన

స్సులో స్నేహ మాయలు తెలియకుండగనే దాగి ఉండెను. ఆయన ఏకాగ్రచిత్తముతో ఒక్కొకరికే శలవు ఇచ్చి పంపి వేయు చుండిరి.

తండ్రి ఈసారి కూడ నిరుత్తరుడై ఉండుట గాంచి, "మహర్షి, నన్ను ఎవరికి దానము చేసితిరి, అని నచికేతుడు మరల ప్రశ్నించెను.

స్నేహ క్రోధ కంఠముతో– 'యమునకు' అని జవాబు చెప్పెను.

నచికేతుని మనస్సునకు ఆనందము కలిగెను. ఇప్పటికి తండ్రిగారి యజ్ఞము సార్థకమైనట్లుగా తలంచెను.

అభ్యాగతు లందరును శలవు గైకొని వెడలిపోయిరి. యజ్ఞ అగ్ని ఆరి పోయెను. ఋషిగారి ఆశ్రమము శూన్యమై దాన సామగ్రి లన్నియు కొనిపోబడెను. పుత్రుడు నచికేతుడుకూడ వారితో వెడలిపోవ సిద్ధపడి ఉన్నటుల ఋషి గ్రహించెను.

"ఎచ్చటికి పోవుచున్నావు, నచికేతా" అని తండ్రి ప్రశ్నించెను.

నచికేతుడు తండ్రికి ప్రణామములు సమర్పించి "మీ దానమును సార్థక పరచుటకు వెడలుచున్నానని" నుడివెను.

— అనగా నేమి ?

— తమరు నన్ను యమునకు దానము చేసితిరి. నేను ఇప్పుడు యముని సంపదను, అందువలన ఆయన వద్దకు పోవుచున్నాను.

బాలకుని ముఖతః ఈ స్థిరగంభీర వాక్యము విని ఋషీశ్వరుడు విస్మితుడాయెను.

— అట్లు అనుమన్నావేమి నచికేతా ? నేను కోపములో నుడివిన వాక్యము సత్యముగునా ? పుత్రుని ఎవరైన ఎప్పుడైన యమునకు దానము చేయుదురా ?

నాకు ఆ విషయము తెలియదు, నాయనా — అట్లని స్నేహముచేత సత్యపాలనమునందు విముఖులగుదురా ? ఋషి ముఖతః అసత్యము ఎన్నడును వెలువడదు.

— కాని ఇది ఎట్లు సాధ్యమగును ?

— ప్రపంచములో జీవితము సస్యము వలె పుట్టుచున్నది, పరిపక్వమై రాలి పోవుచున్నది— ఇట్టి ప్రపంచములో మనుజుని కొరకై సత్యపాలనమునందు విముఖు లగుట ధర్మమా ?

ఆయన ఋషి- వాజశ్రవసను కాననియు తండ్రి- వాజశ్రవస ననియు గ్రహించెను. తాను విశ్వజిత్ యజ్ఞము గావించి పొందలేని జ్ఞానమును చాల నచికేతుడు ఎచ్చటి నుండి పొందగలిగెను ?

ఋషి మరి ఏ విధమునను వాదించ లేకపోయెను.

నచికేతుడు మృత్యులోక మార్గమున యాత్రను ఆరంభించెను.

మర్త్యశిశువు మృత్యుద్వారము వద్దకు బయలు దేరెను.

యమలోక ద్వారము వద్దకు వచ్చి చూచుసరికి, యముడు గృహములో లేనట్లును, ద్వారము బంధింప బడి

యున్నట్లును నచికేతుడు గాంచెను. ఆయనగాక ఈ ద్వారమును మరెవ్వరును తెరువ జాలరు.

యముని రాక కొరకు యమపురి ద్వారము వద్ద నచికేతుడు కాచుకొని ఉండెను.

ఒకరోజు, రెండు రోజులు, మూడు రోజులు గడచి పోయెను.

మూడవరోజు యముడు స్వదేశమునకు తిరిగివచ్చెను, ద్వారము వద్ద ఒక అతిథి కాచుకొని ఉన్నటుల గాంచెను.

మృత్యుశాల చరిత్రలో ఇట్టి సంఘటన ఎన్నడును జరిగియుండలేదు, ఆహ్వానము లేకయే మృత్యుద్వారము వద్ద మానవ శిశువు, నిరాహారముగా మూడు దినములు కాచుకొని ఉండుట ఆశ్చర్య కరమైన విషయము.

మనము సామాన్యులము, యముడు అనినంతనే భయపడుచుందుము. కాని ఆయన పరమ సుందరుడగు నీలకాంత పురుషుడని ఉపనిషత్తులు వ్రాసినవారు నుడువుచుందురు.

నచికేతుడు మూడురోజులు నిరాహారియై తనద్వారము వద్ద కాచుకొని ఉన్నాడని విని యముడు కలవర పడెను.

ఆయన వెంటనే మృత్యుపుర ద్వారమును తెరచివైచెను. మృత్యుద్వారము వద్ద శిశు సూర్యుడు ద్వారపాలకుడై నిలువబడి నట్లుండెను.

మృత్యువు చేతులు జోడించుకొని ఇటుల నుడివెను– ఓ మానవోత్తమా! నీవు ఏ ఉద్దేశముతో స్వయముగా ఇచ్ఛ

టికి వచ్చితివో నాకు తెలియదు, మూడు రోజులు నిరాహారివై నా ద్వారము వద్ద కాచుకొని ఉన్నావు. నా ఈ అపరాధమును మన్నింపుము. నీవు వరములు కోరుకొనుము.

మూడురోజులు కాచుకొని వున్నందుకు మూడు వరములు కోరుకొనుము. మూడువరములు నీకు ప్రసాదించెదను.

ప్రథమమున నచికేతుడు పితృదేవుని విషయము జ్ఞాపకము వచ్చెను. నచికేత ఇంకను హృదయములో శిశువుగానే ఉండెను.

ప్రథమవరము— నా పితృదేవుని మనస్సులో నాకొరకు ఎట్టి విచారము లేకుండునుగాక! నేను మరల తండ్రిగారి వద్దకు పోయినప్పుడు సంతోష హృదయముతో నన్ను స్వీకరించునుగాక!

తథాస్తు అని యముడు ఆశీర్వదించెను, నేను యముడను, అనంత ఐశ్వర్యమునకు అధికారిని, నీవు ఏ వరము కోరుకొనినను నీకు ప్రసాదించెదను.

నచికేతుడు— నాకు ఐశ్వర్యములో ఏమిపని భయగ్రస్తుడగు మానవుడు భయమును జయించి స్వర్గలోకమును పొందునట్టి అభయ మంత్రమును నాకు నేర్పుమని వేడుకొనెను.

యముడు— అదిచాలా కఠినమైన దురవగాహ్యమైన మంత్రము!

నచికేతుడు— నీవు ప్రసాదింపుము, నేను దానినే స్వీకరించెదను.

అప్పుడు యముడు కఠిన సాధన విషయమై క్రమముగా వివరించి చెప్పెను. నచికేతుడు ఆ విషయములు విని మరల యమునకు వినిపించెను. యముడు ఆశ్చర్య మొందెను. తన కంఠ సీమయందున్న రత్నహారమును దీసి నచికేతుని కంఠసీమ యందు అలంకరింప జేసెను. మానవ శిశు కంఠమున యముని రత్న హారములు డోలాయమాన మగుచుండెను.

యముడు— నీవు మూడవ వరమును కోరుకొనుము నచికేతా! రాజ్యములను, ప్రభుత్వమును, దాస దాసీ జనమును, వైభవములను కోరుకొనుము!

నచికేతుడు— అన్నిటికంటె శ్రేష్ఠమైన ఆత్మజ్ఞాన మంత్రమును నాకు ప్రసాదింపుమని వేడుకొనెను.

విముగ్ధ యముడు— ఇంతకంటె మహాత్తరమైనది, నీవు కోరదగినది మరేదియు లేదా ? నచికేతుడు మృత్యువునకు ప్రణామము లర్పించి,— 'అంతకంటె నేను కోరునది మరేదియు లేదని' నుడివెను.

యముడు దేవ దుర్లభమైన ఆ ఆత్మజ్ఞాన మంత్రమును మానవ శిశువగు నచికేతునకు మూడవ వరముగా ప్రసాదించెను. మానవ శిశువు యొక్క మహిమచే ఆనాడు యముని మనస్సు ఉప్పొంగి పోయెను. ఆయన నచికేతుని ప్రబోధించి ఇట్లు నుడివెను.

ఉత్తిష్ఠత జాగ్రత ప్రాప్యవరాన్ని బోధత లెమ్ము, మేల్కొనుము, గురువుల వద్దకు పోయి సదుప దేశములను

ఉత్తమ జ్ఞానమును పొందుము. నచికేతుడు ఆనాడు అమరలోకమునుండి అమృత సందేశమును గొని తెచ్చి అందరికిని ప్రబోధము గావించెను. లెమ్ము — మేల్కొమ్ము.

"సర్వే వేదాయత్ పదమామనంతి, తపాంసి యాదిచ్ఛంతో బ్రహ్మచర్యం చరంతి, తత్తేపదం సంగ్రహేణ బ్రవీమి" ఓమిత్యేతత్ See Text

తాత్పర్యము — సకల వేదములు ఎవరిని గురించి ఘోషించుచున్నవో, తాపసోత్తములు ఎవరికొరకు బ్రహ్మచర్యమును అవలంబించి సాధన గావించుచున్నారో అట్టివాడు ఓమ్ అను పరమేశ్వరుడు, ఆ పరమేశ్వరుడు యీ ప్రపంచములో సర్వత్ర వ్యాపించి ఉన్నాడు.



# సత్యకాముడు

—•(౦)•—

సంధ్యాసమయము. అపుడే సూర్యదేవుడు పశ్చిమ దిగంతప్రాంతమున అస్తమించుచుండెను. వన వనాంతరముల యందున్న వృక్షశాఖల పత్రములపై రక్తరంజితకాంతులు తళతళ మెరయుచుండెను.

గౌతమ ఋషీశ్వరుని తపోవనము వివిధ తరు లతాదులతో పరిపూర్ణమై గంభీర రూపము దాల్చియుండెను. సువాసనల పవిత్ర వాయువులు వీచుచు మనస్సులను ఆనంద పరవశము గావించుచుండెను.

తరంగములను బోలు శ్వేతకేశ గుచ్ఛములు గౌతమ మునీశ్వరుని శిరముపై ఎగురుచుండెను. గంభీరమైన పవిత్రమైన సంధ్యాసమయములో సాంధ్యోపాసనకై మునివరుడు నియమిత ఆసనముపై ప్రశాంత మనస్కుడై ఆసీనుడై యుండెను, శిష్యబృందము శుభ్రస్నాతులై పవిత్ర, ప్రశాంతమనస్కులై, బ్రహ్మవిద్యార్జన కొరకు ఋషివరు నలువైపుల కుశాసనములపై ఆసీనులై యుండిరి.

ఇట్టి సమయములో ఒక దీనబాలుడు, శుభ్రస్వచ్ఛ వదనముతో వినయ విధేయతలతో, గౌతమమునిని సమీపించి, భక్తిపూర్ణ ప్రణామములు అర్పించి, వినమ్రుడై నిలువంబడి యుండెను.

గౌతమముని— ఏమి, నాయనా, అంతయు కుశలమా?

సత్య— చిత్తము.

గౌ— ఇటుల వచ్చితివేమి ?

సత్య— తమ శిష్యకోటిలో చేరి బ్రహ్మవిద్య నభ్యసించుటకు వచ్చితిని.

గౌ— మంచిది, నాయనా, బ్రహ్మ విద్యార్జనకు అర్హులు బ్రాహ్మణులు. నీకులము, నీగోత్రము, నీవంశము మొదలగునవి చెప్పినయెడల అటులనే చేయవచ్చును.

సత్య— చిత్తము. అవి అన్నియు నాకు తెలియదు. నా మాతృదేవి ఉన్నది. ఆమెవద్దకు పోయి వివరములు అన్నియు కనుగొని వచ్చెదను అని ప్రణమిల్లి శలవుగైకొనెను.

సత్యకాముడు బాలుడైనను సత్యనిష్ఠగలవాడు, వినయధేయతలలో ఆరితేరినవాడు సుగుణ గణములచే విభూషితుడైనవాడు, బ్రహ్మవిద్యార్జన కొరకు బద్ధసంకల్పుడు.

ప్రయాణ ప్రయాసనైనను లక్ష్యపెట్టక వనాంతరాళ మార్గములలోబడి ఏకాకిగా సుదూర గ్రామాంతరమునం దున్న జననివద్దకు పోయెను.

చీకటి పడినది, అస్పష్టదీపము పర్ణకుటీరములో వెలిగింపబడి యుండెను. మాతృదేవి స్నేహార్ద్ర హృదయముతో ద్వారమువద్ద నిలువబడి తనయుని రాకకొరకు ఎదురుచూచుచుండెను.

తనయుడు వచ్చినవెంటనే కౌగిట చేర్చుకొని ముఖ వర్చస్సుపై ముద్దిడుకొని "ఋషీశ్వరుడు, ఏమనెను, నాయనా" అని మధురముగా ప్రశ్నించెను.

సత్య— " అమ్మా, గురువుగారిని దర్శించితిని. బ్రహ్మవిద్యకు అర్హులు బ్రాహ్మణులేనట. నాకులము, గోత్రము, వంశమును గురించి ప్రశ్నించినారు, నాకేమియు తెలియదు, మాతృదేవి ఉన్నది, ఆమెను అడిగి వచ్చి చెప్పెదనని తిరిగి వచ్చితిని "

మాతృదేవి అధోవదనయై, కన్నీరు మున్నీరుగా కార్చుచు, తనయునితో నిట్లు నుడివెను—నాయనా, నేను బాల్యకాలమునుండి అనేకుల గృహములలో పరిచారికగా ఉండి పనులొనర్చి కొనుచున్నాను, నీవు ఎప్పుడు పుట్టితివో, ఏకులమో, ఏగోత్రమో, ఏవంశమో నాకు తెలియదు" అని గద్గదస్వరముతో పలికెను.

మరునాడు సత్యకాముడు మరల బయలుదేరి ఆ ప్రశాంత సంధ్యా సమయమునకు ఆ తపోవనమునకు పోయి గురువుగారిని సమీపించి వినమ్రహృదయముతో భక్తిపూర్ణ ప్రణామము లర్పించి నిలువబడి ఉండెను.

గౌతమముని— ఏమినాయనా, అంతయు కుశలమా ? నీ మాతృదేవిని కనుగొని వచ్చితివా ?

సత్య— చిత్తము. కనుగొంటిని ఆమెయు సరిగా చెప్పజాలక పోయినది. బాల్యకాలమునుండియు అనేకుల గృహములలో పరిచారికగా నున్నదనియు, నాకులము, గోత్రము, వంశమును గురించి ఏమియు [illegible]యు నుడివినదని జవాబు చెప్పెను.

సత్యకాముని నోటినుండి ఈమాట వెలువడిన వెంటనే గురువుగారి నలువైపుల ఆసీనులైయున్న శిష్యులంద

రును "ఓరీ, వీడు కులభ్రష్టుడురా, వీడుగోత్రహీనుడురా, వీడికి బ్రహ్మవిద్యేమిటిరా ? " అని వివిధరీతుల నా బాలుని తూలనాడుచు తేనెపట్టునుండివిచ్ఛిన్నమైన మధు మక్షికముల వలె గుసగుస లాడు కొనుచు చంచలురై యుండిరి.

ఇట్టి సమయములో.

గౌతమముని నిమీలిత నేత్రుడు, ధ్యాన నిమగ్న హృదయుడు, తాపసోత్తములలో తపో మహిమాన్వితుడు, కరుణార్ద్ర హృదయుడు బ్రహ్మతేజోమయ స్వరూపుడు, సర్వజీవ దయాపరుడు, భారతదేశ మహోన్నతాదర్శ ప్రచారకుడు, భారతజ్ఞాన గౌరవ ప్రతిష్ఠాపకుడు ఆసనమునుండి పైకి లేచి( కరుణారస ప్రపూర్ణ నేత్రములతో, మాధుర్య ప్రపూర్ణ వాక్యములతో. దివ్యతేజస్సుతో విరాజిల్లుచున్న ఆ బాలుని కౌగిటచేర్చుకుని, ముఖవర్చస్సుపై ముద్దిడుకొని "నాయనా, సత్యకామా, సత్యము చెప్పిన సత్యకాముడవు, ద్విజులలో శ్రేష్ఠుడవు, నీవు సకలసుగుణ సంపన్నుడవు నీవు, బ్రహ్మవిద్యకు అర్హుడవు, నాయనా, అని ఆశీర్వదించి, తన శిష్య గణములో చేర్చుకుని బ్రహ్మవిద్య బోధించెను.

# భృగువు

—(०)—

వరుణ ఋషి కుమారుడు భృగువు.

భృగువు బాల్య కాలముననే వేద వేదాంగములు పఠించెను. కాని మనస్సునకు శాంతిలేదు.

బ్రహ్మ అనగా ఏమిటి, ఎవరు? ఈ ప్రశ్నకు సరియైన జవాబు ఎవరు చెప్పగలరు?

భృగువు తండ్రివద్దకు పోయెను— నాయనా, ఒక ప్రశ్న ఉన్నదనెను.

— అడుగుము, భృగు?

— బ్రహ్మ అనగా ఎవరు, ఏమిటి— ఈ విషయము తెలుసుకొనవలెనని అభిలషించుచున్నాను.

వరుణ ఋషి మనస్సు కలవరము చెందెను. బాలుని ముఖత ఇంత కఠినమైన ప్రశ్నయా? వరుణ ఋషి పుత్రునకు ఇటుల ఉపదేశము నొసంగెను— నాయనా, ఎవని నుండి జీవులు పుట్టుచున్నవో, ఎవనివలన పుట్టిన జీవులు బ్రతుకుచున్నవో, చనిపోయిన పిమ్మట ఎవనిలో ప్రవేశించుచున్నవో అదియే బ్రహ్మ, దానిని తపస్సుద్వారా తెలుసుకొనుము.

భృగువు తపస్సులో కూరుచుండెను. కఠిన తపస్సు గావించిన పిమ్మట ఇట్లు గ్రహించెను—

అన్నమే బ్రహ్మ. అన్నమునుండియే జీవులు పుట్టు చున్నవి, అన్నము వల్లనే జీవించుచున్నవి, అన్నమునందే మరల ప్రవేశించుచున్నవి.

కాని భృగు మనస్సునకు శాంతికలుగలేదు. బ్రహ్మకు అది ఒక్కటే రూపమా, అది ఆయన సంపూర్ణ రూపము కాదు అని ఎవరో ఆయునకు ప్రబోధించుచున్నటుల తోచెను.

భృగు మరల తండ్రిగారిని శరణు జొచ్చెను— నాయనా, నేను తపస్సులో చూచుచుంటిని అన్నమే బ్రహ్మయని గ్రహించితిని. కాని అంతమాత్రము చేత నామనస్సునకు శాంతి కలుగుటలేదు. బ్రహ్మకు మరియొక రూపము గలదా? నుడువుము అని వేడికొనెను.

— వరుణ ఋషి ఇటుల నుడివెను.

— అవును. ఉన్నది ఆయన కేవలము అన్నమే కాదు, ఆయన తపస్సు, తపస్సు వలననే ఆయనను గ్రహింపనగును.

భృగుమరల కఠినతపస్సులో నిమగ్నుడాయెను. అత్యంత కఠోరతపస్సాచరించి, ప్రాణమే బ్రహ్మయని గ్రహించెను.

కాని దానివలన కూడ ఆయన మనస్సునకు శాంతి కలుగలేదు. మరల తపస్సులో నిమగ్నుడాయెను — జ్ఞానమే బ్రహ్మయని గ్రహించెను.

అయినను శాంతి కలుగలేదు. భృగు మరల తపస్సులో నిమగ్నుడయ్యెను. ఇది అంత్య తపస్సు ఈసారి తపస్సు ముగిసిన పిమ్మట ఆయన మనస్సులో శతసూర్యులు ఉదయించు చున్నటుల తోచెను.

ఆయన ఆనందములో ఉప్పొంగిపోయి—"పొందితిని, పొందితిని, ఆయనను తెలుసుకొన గలిగితిని అని నుడివెను. ఆయన ఆనందము! ఆనందము నుండియే అన్నియు పుట్టుచున్నవి, ఆనందము ద్వారానే అన్నియు జీవించుచున్నవి, ఆనందములోనే జీవులన్నియు లయము పొందుచున్నవి."

బాలక భృగుని మహత్తర ప్రశ్నయే నేటి ప్రపంచమును ఆందోళన పరచుచున్నది.



# శ్వేతకేతు

—(१)—

ఉద్దాలక ఋషి పుత్రుని పేరు శ్వేతకేతు.

ఉద్దాలక ఋషి జ్ఞానములో అతుల్యమైనవాడు. ఆయన పుత్రునకు జ్ఞానార్జన యెడల శ్రద్ధలేదని విచారించు వాడు.

శ్వేత కేతునకు ఉపనయన కాలము గడచి పోయినను, అతడు ఇంకను ఆట పాటలలోనే నిమగ్నమై యుండెను. ఉద్దాలక ఋషి తనయుని గద్దించి చెప్పినదేమనగా— "నీవు పొమ్ము ఇంక గృహమున నుండతగవు. నీవు గురు గృహమునకు పోయి అధ్యయనము చేయుము.

శ్వేతకేతువునకు ఆమాటలు కష్టము కలిగించెను. ఆయన గృహమును వీడి గురువుగారి ఆశ్రమమునకు పోయెను. ద్వాదశ సంవత్సరములలో వేదములను వల్లించెను. ఆయన గృహమునుండి వెడలిపోయినపుడు ఆయనకు ద్వాదశ వత్సరముల వయస్సు ఉండెను. వేదములను, వేదాంగములను వ్యాకరణము, ఛందస్సు, జ్యోతిషాదులను పఠించి గృహమునకు తిరిగి వచ్చెను.

శ్వేతకేతు విద్యను ముగించి గృహమునకు తిరిగి వచ్చెను, కాని సమ వయస్కులతో ఎవరితోను మాట్లాడుట లేదు. ఆయనవంటి పండితులు మరెవరు లేరని ఆయన

తలంచువారు. విద్యాభిమానముతో అందరిపైన ఉండ గోరుచుండెను.

శ్వేతకేతు విద్య అంతయు వ్యర్థమై పోయెనని ఉద్దాలక ఋషి తలంచెను. పుత్రుడు బాహ్యాక గ్రంథములను వల్లించినాడే కాని, హృదయములో ఎట్టి జ్ఞానము కలుగలేదు. పుత్రుని యందున్న ఈ మోహమును తొలగింప వలెనని తండ్రి సమకట్టెను.

ఒకనాడు తండ్రి తనయుడైన శ్వేతకేతుని పిలిచి చెప్పినదేమనగా,

— కుమారా, నీవు గురు గృహమున విద్య నభ్యసించితివి. నేను నిన్ను పరీక్షించెదను. నీవు ప్రథమమున పది ఐదు దినములు ఉపవాసము ఉండవలయును దాహము వేసినపుడు మంచి నీటిని మాత్రము త్రాగుచుండ వలయును. పది ఆరవ దినమున నేను పరీక్ష చేయుదును. శ్వేతకేతు పదిఐదు దినములు ఉపవాసము చేసెను. ఆయన దేహము కృశించెను, వివర్ణములు దాల్చెను. ఋక్, సామ, యజుర్వేదములు నీకు కంఠస్థములుగదా, వానిని క్రమముగా అవృత్తి చేయుమని ఉద్దాలక ఋషి పది ఆరవనాడు నుడివెను.

కాని ఉపవాసము చేత శ్వేతకేతు మనోదేహములు దుర్బలముగా ఉండుటచే ఆయన శ్లోకములను స్మరణకు తెచ్చుకొన లేకపోయెను, అందువలన లజ్జితుడాయెను.

ఋషి పుత్రుడు సిగ్గుపడి ఇట్లు ఎందుకు జరిగెనని ప్రశ్నించెను.

అప్పుడు ఉద్దాలక ఋషి ఇట్లు నుడివెను. అగ్ని అంతయు ఆరిపోయిన యెడల, మెరుగుడు పురుగువలె చిన్న కణము మాత్రమే మిగిలియుండును, దాని ద్వారా ఘన కార్య మేదియు నెరవేర జాలదు. ఈసారి నీవు అన్న జలమును స్వీకరించి రమ్ము.

అన్న జలమును స్వీకరించిన పిమ్మట శ్లోకములన్నియు స్మరణకు వచ్చుచున్నటుల శ్వేతకేతు గ్రహించెను. ఈ మానసిక శక్తి అన్నము మీదనే ఆధారపడి యున్నదని గ్రహించెను.

ఉద్దాలక ఋషి పుత్రుని శాంతపరచి, "అన్నము తుచ్ఛమైనదికాదు, మన ప్రాణము అన్నమయ మైనది. ఆ ప్రాణమే నీవు శ్వేతకేతువు" అని నుడివెను.

శ్వేతకేతు కలవరముతో తండ్రి వైపునకు చూచుచు "తమరు ఏమి నుడువు చున్నారు, నాయనా" అని ప్రశ్నించెను.

— అవును, నేను సరిగనే చెప్పుచున్నాను. సర్వ విద్యల సారము మూడు మాటలలో ఇమిడి ఉన్నది. తత్ - త్వం - అసి. నీవు అదియే అగుచున్నావు.

శ్వేతకేతు మరల ఇది ఏమి అని ప్రశ్నించెను.

ఉద్దాలక ఋషి యిట్లు నుడివెను. నీవే అది శ్వేత కేతువు. ప్రాణములో నీవే ప్రాణము, జీవనములో నీవే

జీవనము, నీలో ఈ ప్రాణమయ విశ్వభువనము ఉన్నది. నీవే విశ్వభువనము, శ్వేతకేతు.

ఆశ్రమములో ఒక పెద్ద మర్రిచెట్టు ఉండెను. ఆ చెట్టును చూపించి ఉద్దాలకుడు ఇట్లు నుడివెను. ఇదిగో ఈవృక్షమును చూచుచున్నావు, దీని మొదలులో గొడ్డలితో దెబ్బ వేసిన యెడల దీనికి దెబ్బ తగులును. కాని ఇది చావదు. దీని ప్రతి అణువులోను జీవన శక్తి మిళితమై ఉన్నది. ఆ జీవన శక్తితో చైతన్యము కలిసి ఉన్నది. తత్ఫలితముగా దెబ్బలు తనపై పడినను తనను మరల బ్రతికించుకొనుచుండును. కాని ఈ వృక్షమునుండి ఒక కొమ్మను విరుగగొట్టుదువేని ఆ కొమ్మ ఎండి చచ్చి పోవును. అటులనే మనలో ఆ శక్తి ఉన్నది, దానిని మనము జీవాత్మ అందుము, అది బ్రహ్మ మయమై ఉన్నది. నీవు ఆ బ్రహ్మమయమై ఉన్నావు.

శ్వేతకేతు నేత్రముల నుండి తెర తొలగింప బడినట్లాయెను.

ఋషి ఉద్దాలకుడు పుత్రునిపిలిచి ఆ చెట్టుక్రిందచాలా పండ్లు పడి ఉన్నవి. ఒకదానిని గొని తెమ్మ అనెను.

శ్వేతకేతు ఒక ఫలమును తెచ్చెను.

ఉద్దాలకుడు— ఫలమును విచ్చి చూడుము.

శ్వేతకేతు— ఫలమును విచ్చితిని.

ఉ— ఏమి కనుపడుచున్నది ?

శ్వే— అణువుల వలె సూక్ష్మ బీజములు.

ఉ— బీజములనుండి ఒకదానిని వేరు పరచి, దానిని విచ్చిచూడుము.

శ్వే— విచ్చితిని.

ఉ— ఈసారి ఏమి కాన్పించుచున్నది ?

శ్వేతకేతు— విస్మయమొంది ఏమియు కానుపించుట లేదు అని నుడివెను.

ఉద్దాలకఋషి— నీవు చూడజాలకున్నావు, కాని నీ దృష్టి శక్తిని అతిక్రమించి ఈబీజములో ప్రాణశక్తిఉన్నది. దానినుండియే ఈ మహత్తర వటవృక్షము పుట్టుచున్నది.

ఋషిపుత్రుడు విస్మయ మొందెను.

ఉద్దాలకుడు— మరి ఒక పని చేయుము. కొంచెము ఉప్పు తీసుకొని రమ్ము. ఈ రాత్రి ఆ ఉప్పును నీటిలో పడవైచి ఉంచుము. రేపు ఉదయము మరల దానిని నావద్దకు గొని తెమ్ము.

ఉదయమున శ్వేతకేతు తండ్రి వద్దకు వచ్చెను.

ఉద్దాలకుడు— గతరాత్రి ఏ నీటి పాత్రలో ఉప్పును పడవైచి ఉంచితివో దానిని గొని తెమ్ము.

శ్వేతకేతు ఆ పాత్రను చేతిక్రింద ఉంచుకొని పాత్రలో ఉప్పు లేదని నుడివెను.

ఉ— ఆపాత్రయందున్న పై నీటిని కొంచెము రుచి చూడుము, ఎట్లుండునో ?

శ్వే— ఉప్పగా ఉన్నది.

ఉ— దాని మధ్యనున్న జలమును చవి చూడుము.

శ్వే— ఉప్పగా ఉన్నది.

ఉ— దాని అడుగున ఉన్న జలమును రుచిచూడుము.

శ్వే— ఉప్పగా ఉన్నది.

ఉ— అటులనే ఈ విశ్వ ప్రపంచము నందు ప్రాణశక్తి వ్యాపించి ఉన్నది. అటులనే ప్రాణశక్తిలో మనమందరము లీనమై ఉన్నాము.

ఆ పితా పుత్రుల సంభాషణ భారతదేశములో అమర రూపము దాల్చి ఉన్నది.



# రాజు — రైక్వ

—(o)—

దానధర్మములలో, ప్రజాపరిపాలనములో రాజా జానశ్రుతికి సాటియైనవారు లేరు. పండితుల వద్ద, ఋషుల వద్ద ధర్మ ప్రసంగములను వినుటకు మిగుల వాంఛించుచుండు వారు. ఆయన జీవితమునందెన్నడును అధర్మము ఆచరించ లేదు, ఆయనవంటి ధార్మికుడు, దయాళుడు, దాన శీలుడు మరొకరు లేరు. ఒకరోజున సాయంకాలము దివ్యమైనవెన్నెల కాయుచుండెను, రాజా జానశ్రుతి తన ఏడు అంతస్థుల రాజ భవనముపై కూరుచుని విశ్రమించుచుండెను. హఠాత్తుగా ఆకాశమునుండి తనకు ఈ వార్త వినబడెను—" నీ జానశ్రుతి విషయము ఎవరికి కావలెనయ్యా, రైక్వతో పోల్చ దగిన మహానుభావుడే లేడు. జానశ్రుతి శతసహస్ర దానధర్మ ములు చేసినను, యాగయజ్ఞములు గావించినను, బండివాడ యిన రైక్వని పాదములు కడుగుటకు కూడ అర్హుడుకాడు."

దేవతలు రాజహంసల రూపము ధరించి ప్రపంచ సంచారమునకు బయలు దేరిరి. ప్రపంచములో విశేషధార్మికులు ఎవరో కనిపెట్టుటయే వారి వారి ఉద్దేశము. వారిలో ఒకరి కొకరు ఇటుల చెప్పుచుండిరి, — " ఇది పరమ ధార్మికు డైన జానశ్రుతి రాజుగారి రాజధాని. జానశ్రుతివంటి ధార్మి కుడు, జ్ఞాని, దాత, ఈ ప్రపంచములో మరియొకరు లేరు."

మరియొకరు ఇటుల నుడివిరి — "బండివాడు రైక్వ చాలా ఉత్తముడు, మహానుభావుడు. జానశ్రుతి ధార్మికుడు, జ్ఞాని, దాతకావచ్చును, కాని ఆయన బ్రహ్మజ్ఞాని కాదు, ఆయన ఆత్మను గురించి ఎరుగరు."

రాజు పైకి చూచెను. హంసల పంక్తి ఎగిరిపోవుచు "రైక్వనివద్ద జానశ్రుతి ఎందుకు పనికిరారు" అని నుడువు చుండెను.

రాజుగారి మనస్సులో కలత కలిగెను, అటులనా! ఆయన దానధర్మములు, యాగ యజ్ఞములు, ధర్మకర్మలు అన్నియు వృథాయేనా ఆయనఅత్మను గురించి ఎరుగని కార ణముచేతనా? ఆయనకు ఆరాత్రి నిద్రపట్టలేదు.

మరునాడు ఉదయముననే లేచి సారథిని పిలిపించి "సారథీ, రైక్వ అను పేరుగల పరమ జ్ఞానియు, మహాపురు షుడును ఎవరో ఉన్నారట. ఆయన బండివాడట, పోయి ఆయనను వెదకి కొనిరమ్ము. నేను ఆయన పాదపూజచేసి బ్రహ్మజ్ఞానమును పొందెదను." అని నుడివెను.

వెంటనే నాలుగు వైపులకు రథములు పరుగిడిపోయెను. నౌకరులు పరుగిడిరి, కాని ఎచ్చటను బండివాడైన రైక్వ కానుపించలేదు. గొప్పగొప్ప వారిని గురించి అందరికి తెలి యునుగాని, సామాన్యమైన బండివానిని గురించి ఎవరికి తెలి యును?

బహుదినములు వెదకిన పిమ్మట ఒక బండిక్రింద ఒక జ్యోతిర్మయ పురుషుడు కూరుచుని ఉన్నటుల చూచిరి. ఆ యన ఒక మురికిబట్టధరించి యుండెను, ఎండవేడిమిచేత అతని

శరీరమునుండి చెమట కారుచుండెను, చెమట మురికి కలిసి దేహామంతయు బురదగా ఉండెను ఆయన మానసికముగా దానిని శుభ్రముచేయు చుండెను.

అతని దుస్తులు ఎలావున్నప్పటికిని, అతని జ్యోతిర్మ రూపము చూచినపుడు అతడు మహా పురుషుడని తోచెను. వారు అతనికినమస్కరించి "ప్రభూ, తమ రేనా రైక్వ అను పేరు గలవారు ?" అని ప్రశ్నించెను.

"అవును. నా పేరే రైక్వ అనెను.

రైక్వని వెదకి కనుగొనుటచేత నౌకరులు వెంటనే రాజువద్దకు పరుగిడి పోయి ఆవార్తను తెలియజేసిరి. జాన శ్రుతి తక్షణమే ఆరువందల ఆవులను, ఒక బంగారు హార మును తీసుకుని ఆయనవద్దకు పోయి ప్రణామములు సమ ర్పించెను.

"తమరు ఎవరు ? తమకు ఏమికావలయును?" రైక్వ ప్రశ్న వేసెను.

రాజు—"నేను రాజా జానశ్రుతిని. తమవద్ద బ్రహ్మ జ్ఞానమును యాచించుటకు వచ్చితిని ఈ ఆరువందల ఆవులు, బంగారపు హారము తమకు దక్షిణగా సమర్పించుటకు తెచ్చి తిని దయతో వీనిని స్వీకరించి నాకు బ్రహ్మజ్ఞానమును ప్రసా దింపుడి."

పూర్వకాలములో విద్యనభ్యసించుటకు మూడుమార్గ ములు ఉండెను. గురువువద్ద ఉండి బ్రహ్మచర్యమును పాలిం చుట, గురు సేవచేయుట, ఎవరికైనను ఏదేని విద్యను నేర్పి దానికి బదులు మరియొక విద్యను నేర్చుకొనుట, లేక దక్షిణ

యిచ్చి విద్యనేర్చుకొనుట. రాజా జానశ్రుతి పెద్దవారయి నారు, ఆయన ఈ వయస్సులో బ్రహ్మచర్యపాలన చేయ జాలరు, గురువుగారిసేవకూడ చేయజాలరు, ఆయన రైక్వునికి ఒక విద్యనేర్పి దానికి బదులు మరియొక విద్యనేర్చుకొనునట్టి శక్తి లేదు. అందువలన ఆయన దక్షిణ తీసుకుని వచ్చెను.

కాని దక్షిణ వైపునకు చూచి రైక్వ తన నేత్రము లను మరలించుకొనెను. "నీవు శూద్రుడవు, నీదానము నేను పుచ్చుకొనను, వచ్చిన దారినే వెడలిపొమ్మ" అనెను.

ప్రాచీన కాలపు ఋషులు విశేష తేజము గలవారై యుండిరి. రాజులు కూడ ఋషుల శాసనములను శిరసావ హించెడివారు.

రైక్వ బ్రహ్మజ్ఞానమును పొంది ఈసారి సంసార ధర్మ మును నిర్వహించుటకు సంకల్పించుకొనెను. కాని రాజు గారి దానసామగ్రి జీవన యాత్రకు చాలదు. అందువలన ఆయన ఆదానములను స్వీకరించలేదు.

రైక్వని అభిప్రాయమును గ్రహించి, రాజుగారు తత్క్షణము రాజధానికి తిరిగివచ్చెను, ఈసారి ఒక వెయ్యి ఆవు లను, తన కన్యను, విశేషధనమును తీసుకునివచ్చి రైక్వకు యిచ్చి ఇటుల నుడివెను:—

"నాయీదానమును స్వీకరించి నాకు బ్రహ్మజ్ఞాన మును ప్రసాదింపుడి, ఒక్క వేయిఆవులను తెచ్చితిని, నాకన్యా రత్నమును కూడ తెచ్చితిని, ఈమెను వివాహమాడి గృహ స్థులు కండు, ఈ ధనమును స్వీకరింపుడి, తమకు కావలసిన

సకల సామగ్రిని క్రయముచేయుడు, గ్రామమును కూడా తమకు ఇచ్చుచున్నాను."

ఈసారి రైక్వ ప్రసన్నుడయ్యెను. ఆయన రాజుగారి దానమును స్వీకరించి ఆయనకు బ్రహ్మజ్ఞానమును ప్రసాదించెను. బ్రహ్మజ్ఞానమును పొంది జానశ్రుతి రాజులలో అగ్రస్థానమును ఆక్రమించుకొని అందరి గౌరవమునకు పాత్రుడయ్యెను.

ఈ కథ యందున్న భావము పూర్వకాలములో విద్యకు విశేష గౌరవము ఉండెను. రాజులు తమకుమార్తెలను దరిద్ర పండితులకు యిచ్చి వివాహము చేయువారు. ఆకాలములో గృహస్థ ధర్మము పరమ పవిత్రమైన ధర్మముగా గ్రహించెడివారు. బ్రహ్మజ్ఞానమును సంపాదించి ప్రజలు గృహస్థధర్మమును అవలంబించెడివారు. తరువాత వానప్రస్థమును, సన్యాసమును అవలంబించెడివారు.

# ప్రాణమునకే జయము

—(౦)—

మన దేహములో ఉన్న ఇంద్రియములకు అనగా— ప్రాణము, మనస్సు, వాక్శక్తి, నేత్రములు, చెవులు, వీటికి గొప్పయుద్ధము ఆరంభమాయెను. ప్రతి ఇంద్రియము నేను గొప్పదానను, "నేను గొప్పదానను" అని తలంచుచుండెను. గొప్పవారు ఎవరో నిర్ధారణ కాలేదు. వేరుమార్గము లేక అందరు కలిసి తమతండ్రి అయిన ప్రజాపతి బ్రహ్మవద్దకు పోయిరి. "నాయనా, మాలో ఎవరు గొప్పవారో నీవు నిర్ణయించి చెప్పవలయును" అని నుడివిరి. ప్రజాపతి అందరిని సృష్టించినారు. మానవులను, అసురులను, దేవతలనే కాదు, జలము, వాయువు, పృథివి, వృక్షములనే కాదు, ఈ మనస్సు, ప్రాణము, హస్తములు, పాదములు, నేత్రములు, కర్ణములు, మొదలగు ఇంద్రియముల నన్నిటిని ఆయనయే సృష్టించెను. ప్రజాపతి అందరికిని తండ్రి, ఎవరికెంత శక్తి ఉన్నది, ఎవరికెంత తేజము ఉన్నది ఆయనకు తెలియును. అందువలన ప్రాణము మనస్సు నిర్ణయము కొరకు ఆయన వద్దకు పోయెను.

కాని ప్రజాపతి చాలాచిక్కులో పడిపోయెను. ఆయన అందరికిని తండ్రిగదా. చిన్న ఎవరో, పెద్ద ఎవరో ఆయనకు తెలియును, దీనికి సరియగు జవాబు యిచ్చి ఎవరిని సంతోష

పెట్టును, ఎవరిని కష్టపెట్టును. తండ్రికి అందరును సమానమే. ఆయనకు వెంటనే ఒక ఆలోచన తట్టెను—మీలో ఎవరు వెళ్ళిపోయిన యెడల ఈ శరీర పరిస్థితులు నికృష్టముగా ఉండునో అదియే శ్రేష్ఠమైనది, అతడే గొప్పవాడు.

వాక్శక్తి పని మాట్లాడుట, ఉపన్యాసము లిచ్చుట, "నేను గొప్పదానను, నేను లేని యెడల మీకు జరుగనేరదు. నేను మాట్లాడని యెడల మీకు ఏగతి పట్టునో చూడు ! అందరికంటె గొప్పదానను; అందరికంటె విశేష ప్రయోజన మున్నదానను" అని బెదిరించి వాక్శక్తి శరీరమును వదలి వెడలిపోయెను కాని ప్రపంచములో మూగవారు బ్రతుకు చున్నారుగదా శరీరము మాట్లాడ లేకపోయినదే కాని మిగి లిన పనులన్నియు నెరవేర్చు కొనుచున్నది. అది నేత్రముల తో చూచుచున్నది, చెవులతో వినుచున్నది, మనస్సుతో ఆలోచించుచున్నది, జీవించి ఉన్నది. వాక్శక్తి లేనందువలన ఇబ్బంది ఏమియు గలుగలేదు. వాక్యము ఒక నెల, రెండు నెలలు, ఒక సంవత్సరము తిరిగిరాక యుండెను. పిమ్మట తానే స్వయముగా వచ్చెను. దివ్యముగానున్న శరీరమును చూచి ఆశ్చర్య మొందెను—"నేను యింతకాలము లేను గదా, నీవు ఎలావున్నావు" అని ప్రశ్నించెను. "ఏమి, చక్కగా ఉన్నానుగా. ఇబ్బంది ఏమియు కలుగలేదు," అని శరీరము జవాబిచ్చెను. మాట్లాడలేకపోయితిని, కాని చెవు లతో వినుచున్నాను, కండ్లతో చూచుచున్నాను, మనస్సు తో ఆలోచించితిని, బ్రతికే హాయిగా ఉన్నసంగతి చూచు

చున్నావు గదా అనెను, ఈ మాటలు విని వాక్కు సిగ్గు పడిపోయెను, తలవంచుకొనెను. గర్వము వీడి, ఓడిపోయితి నని తలంచి మరల శరీరములో ప్రవేశించెను.

ఈ సారి నేత్రములు గర్వించెను. వాక్కుతో దానికి యుద్ధము జరిగెను. నేత్రములైన నేను లేనియెడల ప్రపంచము అంతయు అంధకారమయి ఉండును. నేను చూచినగదా కార్యములు అన్నియు నెరవేరుట. వాక్కు ఓడి పోయినది. నేనే గొప్పదానినని మీరు ఈసారి అంగీకరించక తప్పదు. అని నేత్రము నుడివెను. తన విషయము ప్రమాణము చేయుటకై నేత్రములు శరీరమును వదలి వెడలిపోయెను. కాని ప్రపంచములో అంధులు లేరా ? జీవితము హాయిగా గడచిపోవు చుండెను. ఒక నెల, రెండు నెలలు, ఒక సంవత్సరము గడచి పోయెను. శరీరమునకు ఏగతి పట్టినదో చూడవలెనని నేత్రములకు కోరిక కలిగెను. శరీరమును చూచి నేత్రములు ఆశ్చర్యపడెను. " నేను లేకపోవుటచే నీకు చాలా యిబ్బంది కలిగినది గదా ? చాలా కష్టములు అనుభవించి యుందురు" అని నేత్రములు నుడివెను.

" ఏలాటి యిబ్బందిగాని, కష్టములుగాని కలుగలేదు, నేత్రములతో చూడలేదుగాని, చెవులతో విన్నాను, నోటితో మాట్లాడితిని, హాయిగా బ్రతికి ఉన్నాను, మనస్సుతో ఆలోచనములు గావించితిని " అని శరీరము జవాబు నిచ్చెను. ఈ మాట విని నేత్రములు మరల శరీరములో ప్రవేశించెను. ఈ విధముగా నేత్రములకు గర్వభంగము కలిగెను.

నేత్రములకు సమీపమున నున్నవి చెవులు. అహంకార విషయములో తీసి పోవునవి కావు, కాని ఆడంబరము కొంత తక్కువ. అందరి కండ్ల ఎదుట నేత్రములకు అవమానము కలిగెను. "ఈసారి నాగొప్పతనము చూపించెదనని" చెవి తలంచెను. అది నిశ్శబ్దముగా శరీరమును వీడి వెడలి పోయెను. శరీరము వినలేదు. చెవిటిదై పోయెను కాని దానికి నష్టమేమియు లేదు. చెవులు కూడ ఒక నెల, రెండు నెలలు, ఒక సంవత్సరము వేచియుండి తిరిగివచ్చెను. సుందరమైన శరీరమును గాంచి "ఆ ఏమిటి ? నీవు ఇంకను ఇటులనే ఉన్నావా ? అయితే నేను కూడ ఓడిపోయినట్లేనా ?" అనెను. "చాలా రోజులకు తిరిగి వచ్చితిని, మీరందరు బాగుగానే ఉన్నారే" అని చెప్పెను. "బాగుగానే వున్నాము, చెవులతో వినలేక పోయినాము. చెవుడు సంభవించినది. కాని కండ్లతో చూచితిమి, నోటితో మాట్లాడితిని. మనస్సుతో ఆలోచించితిని హాయిగా బ్రతికి ఉన్నాను" అని శరీరము జవాబిచ్చెను. జవాబు విని చెవులు అవమానము భరించలేక పోయెను. అది మరల శరీరములో ప్రవేశించెను.

మనస్సు ఆలోచించు చుండును, విచారణలు సల్పుచుండును, చెవులు, నేత్రములు, వాక్కు ఇవన్ని గొప్పవి కానేకావు. గొప్పవి కాజాలవు. నేను, ప్రాణము మాత్రమే నిలిచి యున్నాము, ప్రాణమునకు ఏమి పని ఉన్నది ? అది గొప్పది కాదలంచుట వృథా. మనస్సు శరీరమును వదలి

వెడలి పోయెను. అది శిశు జీవితము వంటిది. అది బ్రతికి యుండుటయేగాక సుఖముకూడ యుండును.

మనో వృత్తులు అస్ఫుటమైనవి. శక్తి అసంపూర్ణమైనది. కాని దినములు హాయిగా గడచుచుండెను. మనస్సు ఒక సంవత్సరము బయట గడపి తిరిగి వచ్చెను. ఓహో నేను లేకపోయినా శరీరము హాయిగా ఉన్నదే, ఏమిటి దీని మజా! విచారము లేదు, దిగులులేదు, శరీరము దివ్యముగా ఉన్నది? అయితే ఎవరుగొప్ప? అని తలంచెను, ఏది గొప్పదియో ఇంతవరకు ఎవరును నిర్ణయించ లేదు. "ఏమోయ్, నేను తిరిగి వచ్చితిని, మీరందరు హాయిగా బ్రతికియేఉన్నారే? మీరందరును మహా సుఖంగానే రోజులు గడపుచున్నారా?" "ఓ. మహా మజాగా రోజులు గడపుచున్నాము. దిగులు, విచారము ఏమియు లేదు. శిశువులవలె ఉన్నాము. సుఖ సంతోషములకు లోటులేదు. కండ్లతో చూచితిమి, చెవులతో వింటిమి, నోటితో మాట్లాడితిమి, హాయిగా బ్రతికి ఉన్నామని చూచుచునే ఉన్నావు గదా" అనెను. జవాబు విని మనస్సుకూడ సిగ్గుపడి శరీరములో ప్రవేశించెను. కాని ఎవరు గొప్పవారో ఇంతవరకును నిర్ణయము కాలేదు.

ప్రాణము ఇంతవరకు నిశ్శబ్దముగా ఉండి చూచుచుండెను. ఎవరేమి చేయుదురా అని ధైర్యము వహించి ఉండెను. తాను అన్నిటి కంటె గొప్పదని తనకు తెలియును. అది లేని యెడల శరీరము బ్రతుక జాలదు. ప్రాణము బలము

కలిగి ఉన్నపుడే కండ్లు, చెవులు, వాక్కు, మనస్సు తమ తమ కార్యములను నెరవేర్చుకొన గలవు. ప్రాణము సమస్త శరీరము నందు వ్యాపించి నిశ్శబ్దముగా తన కార్యములను గావించు కొనుచుండును, చేతులను, పాదములను, కండ్లను, చెవులను, వాక్కును, మనస్సును, సమస్తమును పట్టుకొని యుండును, సమస్తమును పోషించు చుండును. వేలు, లక్షల నరములలో సూక్ష్మ నరములకు సహా ప్రాణశక్తిని సమ కూర్చుచుండును. ప్రాణము గుండెలలో రక్తమును చలింప చేయును, ప్రాణము నిశ్వాస ప్రశ్వాసముల ద్వారా జీవన శక్తిని నిలిపి యుంచును, ప్రాణమే అన్నిటికిని ప్రాణము, అన్నిటికంటె గొప్పది.

అందరి అహంకారము తగ్గిన పిమ్మట తాను శరీరము నుండి వెలికి పోవుటకు ప్రయత్నించు చుండెను. కండ్లు, చెవులు, వాక్కు, మనస్సు అన్నిటియొక్క ఆసనము కదుల జొచ్చెను. అన్నిటికి ప్రమాదము సంభవించనుండెను. బల శాలియగు గుర్రము కొరడా దెబ్బ వలన తన బంధనముల నన్నిటిని త్రెంచుకొని పారిపోవ ప్రయత్నించినటుల మనస్సు ఇంద్రియములు అను పగ్గములను త్రెంచుకొని ప్రాణము శరీర మునుండి వెడలిపోవ సంసిద్ధ మాయెను. మనస్సు, వాక్కు, కండ్లు, చెవులు ప్రమాదము సంభవించ నున్నదని భావించి పరుగిడిపోయి ప్రాణముయొక్క పాదములపై బడి “ పోవ లదు, శరీరమును వదలి పోవలదు. నీవే గొప్ప దానవు, మా అందరికంటె నీవే గొప్పదానవు, నీకే జయము” అని

ప్రార్థించు కొనెను. నీవు మాకు రాజువు, నీజీవితము వల్లనే మేముజీవించియున్నాము.నీబలమునుండియే మాకుబలములభించుచున్నది" అని మనస్సు, ఇంద్రియములు సమస్వరముతో వేడుకొనెను. నీ జయమువల్లనే అందరికినిజయము కలుగుచున్నది. తేనెటీగల రాణి లేచినయెడల తేనెటీగలన్నియు లేచిపోవును, రాణి కూరుచునిఉండినయెడల అన్నియు కూరుచుని ఉండును, అటులనే మేముకూడ నీతోకూడ శరీరమునుండి లేచిపోదుము, శరీరములోనికి తిరిగి వచ్చుచుందుము. అవిఅన్నియు ప్రాణమును పొగడి, కీర్తించి, అభయము కోరెను. "ప్రాణమా నీవే అగ్నివి, నీవే తేజము, నీవే ప్రజాపతివి, నీవే సృష్టి శక్తివి నీయందే ఈ విశ్వబ్రహ్మాండము ప్రతిష్ఠింప బడి యున్నది. తల్లి పిల్లలను రక్షించి నటుల నీవు మమ్ములను రక్షించుచున్నావు.

పిమ్మట వాక్కు ఇటుల నుడివెను. "వాక్శక్తిచే అందరిని ఓడించి విశేష ధనమును గడింతును. అందువలన ఋషులు నన్ను "వసిష్ఠ" అందురు. నేను వసిష్ఠనయినచో నీవు కూడ వసిష్ఠవే, నాశక్తి నాకు నీనుండి లభించినదే."

నేత్రములు ఇటుల నుడివెను. "నేను జాగ్రతగా నడచిన యెడల ప్రజలకు పతనమునుగాని, ఆపదలుగాని ఎన్నడు సంభవించవు. అందువలన ఋషులునన్ను "ప్రతిష్ఠ" అందురు. ఓ ప్రాణమా, నేను ప్రతిష్ఠ నయినచో నీవును ప్రతిష్ఠవే, నాకున్న శక్తి నీనుండి లభించినదే."

చెవులు ఇటుల నుడివెను. "నా సహాయముతో ప్రజలు వేదములు విని విద్వాంసు లగుచుందురు. విద్య వలన

ధనము గడించుచుందురు. అందువలన ఋషులు నన్ను "సంపదు" అందురు. నేను సంపద అయినచో నీవు కూడ సంపదవే, నాకు నీనుండియే శక్తి లభించినది."

అంత్యమున మనసు ఇటుల నుడివెను. "నేను అందరికిని ఆశ్రయమై ఉండుటచే ఋషులు నన్ను "ఆయతనము" అందురు. నేను ఆయతనము నైన యెడల నీవుకూడ ఆయతనమే. నా శక్తి అంతయు నీనుండి లభించినదే."

ప్రాణము అందరి స్తోత్రములు విని సంతోషించెను. తాను అందరి కంటె గొప్పదాననని అందరు గ్రహించినందుకు విశేషముగా తృప్తి జెందెను. మనము మనలను కండ్లు, చెవులు, మనస్సు అని నుడువము, ప్రాణము అనియే అందుము. మనలను చూపించు నపుడుకూడ ప్రాణమునకు ప్రధాన స్థానమైన రొమ్ముపై చేయివేసి "నేను" అని చూపింతుము. ప్రజలకు ప్రాణమే మహత్తరమైనది. ప్రాణమే ఆత్మ. ఈ ప్రాణశక్తివలన ఇంద్రియములు మనస్సు, బుద్ధి, నడచుచున్నవి. ధ్యాన సమాధుల ద్వారా యథార్థమైన ఆత్మజ్ఞానము లభించుచున్నది.

జబాలా పుత్రుడు సత్యకాముడు గోశ్రుతి అనువారికి ప్రాణమును గురించిన ఈ కథ వినిపించి ఇటుల నుడివెను. "ఈ కథ వినిన యెడల శుష్క కాష్ఠములు సహా చిగుర్చును, నవ నవ రూపము ధరించును. ఋషుల వాక్యములు సత్యవాక్యములు.

# ఇంద్రుని తపస్సు

—(౦)—

" జనన మరణములు లేని, పాపపుణ్యములకు అతీతమైన, క్షుత్పిపాసలు, శోకతాపములు లేని, శాశ్వత ఆత్మను గ్రహింప గలిగిన యెడల కోరికలు అన్నియు, నెరవేరును, సకలసుఖములు లభించును " అని ప్రజాపతి నుడివెను.

దేవతలు, అసురులు ప్రజాపతిమాట విని ఆనందముతో గంతులువేసిరి. " ఓహో, మంచి మార్గము దొరికినదని సంతోషించిరి. ఆత్మనుగురించి తెలుసుకొన వలయును, అట్లు తెలుసుకొన గలిగిన యెడల మనకు అసాధ్యమైనది మరి ఏముండును? " అసురులు ఇట్లు తలంచెను—

—ఆత్మను గురించి గ్రహింపగలిగిన యెడల మనము అజేయులము, మనతో యుద్ధము చేయువారు మరెవరు ఉండరు, స్వర్గమర్త్యముల నన్నిటిని జయించి మనము మానవ దేవతలపై ప్రభుత్వము చేయుదము. సమస్త ధనధాన్యములను మనము వశపరచుకుని సుఖపడెదము, మనము ఎట్టి కష్టములు భరింపవలసిన పనిలేదు, చిరకాలము ఆనందముతో, రోజులు గడుపగలము " అని అసురులు తలంచిరి.

దేవతలు ఇట్లు తలంచిరి— " మంచిది, ఆత్మను గురించి తెలుసుకొన గలిగినయెడల మన ప్రభుత్వమే శాశ్వ

తముగా నిలచియుండును. దుఃఖములు, కష్టములు మనలను బాధింపజాలవు. అసురులు మనపైన ప్రభుత్వము చేయగోరు చున్నారు. మనము ఆత్మను తెలుసుకొనగలిగిన యెడల వారు ఇక తల యెత్తజాలరు, మనము వారిని అణచియుంచెదము."

దేవతలు, అసురులు ఉభయ పక్షముల వారును ప్రజాపతివద్దకు పోయి ఆత్మజ్ఞానమును పొందవలయునని నిర్ణయించుకొనిరి. కాని బ్రహ్మ అంత సులభముగా ఆత్మజ్ఞానమును ప్రసాదింపరు, ఆయన వద్దకు పోయి కఠోర బ్రహ్మచర్యమును అవలంబించవలయును, సేవా శుశ్రూషలద్వారా ఆయనను సంతోష పెట్టవలయును, అట్లయిన యెడల ఆయన ఆత్మజ్ఞానమును ప్రసాదింతురు.

దేవతలు దేవరాజగు ఇంద్రుని పంపుటకు నిర్ణయించుకొనిరి, అసురులు అసురరాజగు విరోచననే పంపుటకు నిర్ణయించుకొనిరి.

ఒక శుభదివమున ఇంద్రుడు, విరోచన యజ్ఞకాష్ఠములతో ప్రజాపతి ఆశ్రమమున ప్రవేశించిరి. దేతలు, అసురులు ఉభయులు ప్రజాపతి సంతానము, ఆకారణముచేత ఇంద్రుడు, విరోచన ఇద్దరును సోదరులు. సోదరులు ఇద్దరు ఆత్మజ్ఞానమును పొందుటకు తండ్రిగారి ఆశ్రమమునకు పోయి శిష్య బృందములో చేరిరి. కాని వారు అచ్చటికి ఏ ఉద్దేశ

ముతో పోయినది ఇంద్రుడు విరోచనకుగాని, విరోచన ఇం ద్రునకుగాని తెలియ చేయలేదు.

ఇంద్రుడు, విరోచన ప్రజాపతి సేవచేయు చుండిరి, యజ్ఞకాష్టములను సమకూర్చుచుండిరి, హోమము, పూజ, ఆరాధనములకు కావలసిన సామగ్రిని సంపాదించు చుండిరి, తాము పవిత్ర బ్రహ్మచర్య వ్రతమును పాలించుచుండిరి.

ఈ విధముగా సంవత్సరములు గతించిపోవు చుండెను, కాని ఏ ఉద్దేశముతో వారు అచ్చటికి వచ్చినది ప్రజాపతి ఒక్కసారి అయినను వారిని ప్రశ్నించలేదు. ఇంద్రుడు, విరోచన ఓపికతో నిలువబడిఉండిరి. బ్రహ్మజ్ఞానమునుబోధిం పమని ప్రజాపతిని తొందర పెట్టలేదు. ఆయన సేవ శ్రద్ధతో భక్తితో చేయుచుండిన యడల ఆయన సంతోషించి బ్రహ్మ జ్ఞానమును ప్రసాదింప వచ్చునని నమ్మి యుండిరి.

ఈ విధముగా ఒక సంవత్సరము రెండు సంవత్సర ములు, పన్నెండు సంవత్సరములు కూడ గడచి పోయెను, ఒక యుగము కూడ గతించిపోయెను, రెండు యుగములు గతించిన పిమ్మట ప్రజాపతి ఇంద్రుని, విరోచనుని ఇటుల ప్రశ్నించెను—"బిడ్డలారా, మీరు రాజ్యమును ఐశ్వర్య ములు, భోగభాగ్యములను విసర్జించి; ఇచ్చటికి వచ్చి దేని కొరకు మీరు ఈ కఠిన వ్రతములను పాలించు చున్నారు? ఏ ఉద్దేశముతో మీరు ఇంత శ్రద్ధాభక్తితో నాసేవ చేయు చున్నారు?"

ఇంద్రుడు, విరోచన ఇటుల నుడివెను— "ఆత్మను తెలిసికొనినయెడల ఎట్టిదుఃఖ కష్టములు ఉండవనియు, సకల కోరికలు నెరవేరుననియు తమరు నుడివి యుంటిరి. అందు వలన తమవద్ద ఆత్మజ్ఞానమునుపొందుటకు వచ్చితిమి. తమరు మాకు ఆత్మజ్ఞానమును ప్రసాదించి కృతార్థులను చేయుడు"

ప్రజాపతి మిక్కిలి సంతోషించెను. తన బిడ్డలు ఆత్మ జ్ఞానమును సంపాదింప కోరుచున్నారు, ఇంతకంటె ఆనంద దాయకమైన విషయము మరేమిగలదు? ఇంద్రునకు, విరో చనునకు ఇటుల ఉపదేశించెను— "నేత్రములలో ఎవరిని చూచుచున్నారో, ఆయనయే ఆత్మ."

ప్రజాపతి మాట విని ఇంద్రుడు, విరోచనుడు మరల ఇటుల నుడివెను—"నీటిలో చూచినయెడల ఒకరిని చూచు చున్నాము, మరల అద్దములో చూచినను ఒకరినే చూచు చున్నాము. వీరిలో ఏది ఆత్మ?"

ఇంద్రుడు, విరోచనుడు చేసిన ప్రశ్న విని ప్రజాపతి మిగుల విచారించెను. వారు ముప్పది సంవత్సరములు కఠోర బ్రహ్మచర్యమును అవలంబించినను వారి బుద్ధి నిర్మలము కాలేదనియు, వారు ఆయన ఉపదేశ సారమును గ్రహింప లేదనియు ఆయన తలంచెను. ఆయన నుడివిన ఉపదేశ సారము. "ఎవని తేజస్సు, లేక జ్యోతి నేత్రముల ద్వారా అనుభవించ నగునో, ఎవని వెలుతురు వలన నేత్రములకు

వెలుగు కలుగుచున్నదో, ఆయనయే ఆత్మ. కాని ఇంద్రుని, విరోచనుని మస్తిష్కములో ఆ భావార్థము ప్రవేశించ లేదు. "నేత్రముల ద్వారా ఏ ప్రతిబింబము అనగా నీడ చూడ నగునో, ప్రజాపతి దానినే ఆత్మ" అని నుడివి నటుల వారు గ్రహించిరి.

ఇంద్రునకు, విరోచనునకు దాని భావమును స్పష్టముగా తెలియ జేయుటకు ప్రజాపతి మరల ఇటుల ఉపదేశించెను.

— "ఒక నీటిపాత్రను తీసుకొని రమ్ము. దానిలో చూడుడి. ఏమి చూచుచున్నావు" అని ప్రశ్నించెను.

" మా స్వరూపము – అనగా ముఖము, ముక్కు, కండ్లు, చెవులు, తల, గడ్డము. ఇవి అన్నియు చూచు చున్నాము" అని నుడివెను.

" మంచిది, ఇప్పుడు తల, గడ్డము కత్తిరించుకొని ఈ చెట్ల బెరడును విడనాడి మంచి వస్త్రమును అంగీయును ధరించి రమ్ము అనెను,

ఇంద్రుడు, విరోచనుడు గురు ఆదేశమును పాలించిన పిమ్మట ప్రజాపతి మరల ఇటుల ప్రశ్నించెను. " మరల పాత్రలో చూడుము" అనెను. చూచుచుండగా ఈసారి ఏమి చూచుచున్నావని ప్రశ్నించెను.

" మా స్వరూపమునే చూచుచున్నాము, కాని పరిశుభ్రముగా, నిర్మలముగా నున్న దుస్తులను ధరించిన స్వరూపమును చూచుచున్నాము" అనెను.

" చక్కగా చూడుడి ఏది చూచుచున్నావో అదియే ఆత్మ " అని ప్రజాపతి నుడివెను.

ప్రజాపతి యీసారి విషయమును స్పష్టముగా తెలియ జేసినారు గనుక మనము చక్కగా గ్రహించితిమి. ఈసారి మనము వెళ్ళవచ్చును " అని తలంచిరి.

ఇట్లు తలంచి ప్రజాపతికి సాష్టాంగ ప్రణామములు అర్పించి వెడలి పోయిరి. ఇంద్రుడు తన స్వర్గ రాజ్యమునకును, విరోచనుడు తన రాజ్యమునకును పోయిరి.

కాని ఈసారి కూడ వారు సరిగా గ్రహింప లేక పోయిరి.

నీటిలో కనుపడుచున్న ఈ దేహముయొక్క ఛాయనే వారు ఆత్మయని తలంచిరి, అసురులు భోగములను అనుభవించువారు సుఖ సంతోషములను అనుభ వించుట, ఐశ్వర్యములతో తులతూగుట వారి పరమోద్దేశము. అందువలన విరోచనుడు సంతోషించెను. అసురులతో ఇటుల నుడివెను. " సోదరులారా! ప్రజాపతి ఇటుల నుడివెను. ఈ దేహమే ఆత్మ. దేహమునకు సుఖము కలుగునట్టి ప్రయత్నముల నే చేయుచుండ వలయును. దేహము కొంతకాలమునకు నశించి పోవును. ఇప్పుడే సమయము కనిపెట్టి మనము సుఖము అనుభవింతము "

విరోచనుని ఆదేశాను సారముగా వారు సాంసారిక సుఖములలో మదోన్మత్తులైరి. తమ సుఖము కొరకు ప్రజా పీడనము గావింప జొచ్చిరి.

కాని స్వర్గ రాజ్యములో ప్రవేశించు మార్గమునందే

ఇంద్రుని మనస్సులో ఘోర సందేహము ఉదయించెను. ఆయన ఇట్లుల తలంచిరి "మాకు పొడుగు గడ్డము, తల వెంట్రుకలు ఉన్నపుడు మా ఛాయ ఒక విధముగా కను పించెను. గడ్డము పొడుగు వెంట్రుకలు కత్తిరించుకుని, చక్కని దుస్తులను ధరించినపుడు మా నీడ అద్దములో మరి యొక విధముగా కానుపించుచున్నది ఆత్మకు ఎట్టి మార్పు కలుగదని పెద్దల వలన వింటిని. అట్లైన యెడల యీ దేహము ఆత్మ ఎట్లు కాగలదు ?

ఇంద్రుడు దేవత. అందువలన విరోచనునివలెసంసార భోగములనే జీవితమునకు పరమావధిగా అంగీకరించలేదు, యథార్థ జ్ఞానము కొరకు ఆయన మనస్సు పరితపించెను.

స్వర్గరాజ్యమున ప్రవేశించిన పిమ్మట దేవతలు ప్రశ్నించిరి. "దేవరాజా! ప్రజాపతి వద్ద ఏమి నేర్చు కొంటిరి ? మాకు కూడ నేర్పుడు ?

ఇంద్రుడు సమాధానము చెప్పెను. "సోదరులారా! ఆత్మ అనగా ఏదియో దానిని తెలిసి కొంటినని ప్రథమ మున తలంచితిని, కాని నామనస్సులో సందేహము కలిగినది. ఇంకను సరిగా గ్రహింపలేదు. నేను మరల ప్రజాపతి వద్దకు వెళ్ళవలయును."

ఇంద్రుడు మరల యజ్ఞకాష్ఠములు తీసుకుని ప్రజాపతి వద్దకు పోయెను. ప్రజాపతి ఆశ్చర్యపడెను ఏమి ఇంద్రా! మరల వచ్చితివేమి ? అని ప్రశ్నించెను

ఇంద్రుడు తనకు కలిగిన సందేహమును గురించి తెలియపరచెను. ప్రజాపతి మరల నుడివెను. "సరె,

మంచిది, నేను నేర్పెదను. మరల నీవు ఆశ్రమములో ముప్పది రెండు సంవత్సరములు బ్రహ్మచర్యము పాలింప వల యును. నీ మనస్సు నిర్మలము కాలేదు, మనస్సు నిర్మలము కాని యెడల ఏమియు గ్రహింప జాలవు. అందువలన మరల ముప్పది సంవత్సరములు బ్రహ్మచర్య వ్రతమును అవలం బించి ఉండవలయును."

ముప్పదిరెండు సంవత్సరములా! అబ్బో చాలాదిన ములే! కాని ఇంద్రుడు వదలిపెట్టలేదు, ఆయన ఆత్మజ్ఞాన మును సంపాదించుటకు సంకల్పించు కొనెను. ఆయన మరల ఆశ్రమములో బ్రహ్మచర్యమును అవలంబించి యుండుట కును, గురువుగారి సేవ చేయుటకును, ఆరంభించెను.

ముప్పదిరెండు సంవత్సరములు గతించిన పిమ్మట ప్రజాపతి ఒక రోజున ఇంద్రునకు ఇటుల నుడివెను—"రెండు సారులు అరువది నాలుగు సంవత్సరములు నీవు బ్రహ్మచర్య మును అవలంబించి ఆశ్రమమునందు ఉంటివి, ఈ సారి నీమ నస్సు నిర్మలమై ఉండవచ్చును, ఈసారి నీవు ఆత్మతత్వమును గ్రహింపవచ్చును. "దేహము నిద్రించునపుడు స్వప్నములో మేలుకొని ఉండునదియే ఆత్మ."

ప్రజాపతి మాట విని ఇంద్రునకు సంతోషము కలి గెను. "ఈసారి గ్రహించి యుండవచ్చును, శరీరము ఆత్మ ఎట్లు కాగలదు? దానికి జననమరణములు ఉన్నవి, పరివర్త నము ఉన్నది. నిద్రవిషయము ఆలోచింప నగును—మనము

నిద్రించు సమయములో దేహము శవమువలె పడియుండును. ఆ పరిస్థితులలో స్వప్నమునందు కూడ ఒకరు భుజించుచుం దురు, విహరించుచుందురు, కార్యములు ఆచరించుచుందురు, చూచుచుందురు. అదియే ఆత్మ, దేహము కాదు."

ఇట్లు తలంచి ఇంద్రుడు ప్రజాపతికి నమస్కరించి వెడలిపోయెను. కొన్ని దినములు గడిచిన పిమ్మట మరల ఆయనకు సందేహము కలిగెను. "ఆత్మకు శోకతాపములు దుఃఖ భయములు లేవని విని యుంటిని, స్వప్నములో ఎన్నియో శోకములను, ఎన్నియో భయములను అనుభవిం చుచున్నాము. కొన్నిసారులు ఏడ్చుచుందుము. అట్లయిన చో స్వప్న పురుషుడు ఆత్మ ఎట్లు కాగలదు.?

సందేహము కలుగుటచే యజ్ఞ కాష్ఠములను చేనిడి కొని ఇంద్రుడు మరల ఆశ్రమములో ప్రవేశించెను. "ఏమి, ఇంద్రా. మరల వచ్చితివేమి ? మరల సందేహము కలిగి నదా ? అని ప్రజాపతి ప్రశ్నించెను.

ఇంద్రుడు ఇటుల జవాబిచ్చెను. "అవును, నాయనా నా సందేహము ఇంకను తొలగి పోలేదు, నేను ఇంకను సరిగా గ్రహింపలేదు. ఇంద్రుడు మరల తనకు కలిగిన సందే హ విషయము ప్రజాపతి విని, ఇంద్రునకు కలిగిన జ్ఞాన దాహమునకు మెచ్చుకుని " నాయనా ఇంద్రా ! నీకు మరల సందేహము కలిగినందుకు సంతోషము. నీకు ఆత్మ జ్ఞాన మును ప్రసాదించెదను, కాని మరల ముప్పదిరెండు సంవత్స రములు బ్రహ్మచర్యమును అవలంబించి ఉండవలయును " అని నుడివెను.

ఇంద్రుడుగాక మరి ఒకరు అయిన యెడల "చాలు బాబు" అని తలవు తీసుకొని వెళ్ళిసిన దే, కాని ఇంద్రుడు పట్టుదల గలవాడు. దీనికి పరతంత్రుడు, బ్రహ్మజ్ఞాన సక్తుడు. అందువలన ఆయన ఏమాత్రము భయపడక మరల ప్రజాపతి ఆశ్రమమునకు పోయి బ్రహ్మచర్య పాలన చేయుచు, గురువుగారి సేవ గావించుచుండెను.

ముప్పదిరెండు సంవత్సరములు పూర్తి అయినపిమ్మట ఒకరోజున ప్రజాపతి ఇంద్రునకు ఇటుల బోధించెను—

"నాయనా! దేహము నిద్రించు చున్నపుడు స్వప్నము చూడనివాడును, నిద్రించుటను ప్రసన్నత నష్టముకానివాడు, ఆత్మ అని గ్రహింపుము."

96 సంవత్సరముల పిమ్మట ఆత్మ విషయము గ్రహించితిననియు, సాధన సార్థకమైన దనియు ఇంద్రుడు తలంచి ప్రజాపతికి ప్రణమిల్లి వెడలిపోయెను.

కాని ఆయన సందేహము ఇంకను నివారణ కాలేదు. "ప్రజాపతి యీసారి ఎవరి విషయము చెప్పెనో, ఆయన స్వప్నసమయములో శవమువలె చైతన్య హీనుడు. ఆయన ఉన్నాడో, లెడో, విశ్వబ్రహ్మాండము ఉన్నదో లేదో, అను జ్ఞానము ఆయనకు ఉండదు. ఆత్మ చైతన్య మయమైనది, అందువలన ఇదికూడ ఆత్మ కాజాలదు." అని తలంచెను.

